

# నాగానందనాటకము.



మదరాసు క్రిస్టియన్ కాలెజ్
సంస్కృత ప్రధాన పండితుఁడగు
వేదము - వేంకటరాయశాస్త్రిచే
తెనిఁగింపఁబడినది.

తృతీయముద్రణము.



చెన్నపురి:
కేసరి ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.



1929.

# ద్వితీయముద్రణావతారిక.

ఈగ్రంథంపుం బ్రతులు నాలుగైదేండ్లనుండి అలభ్యములై యున్నను అపుడపుడు వారువారు అపేక్షించుచున్నను ఇంతకాలము ఇతరగ్రంథములను రచించుచుండి ఏతత్పునర్ముద్రణమునకు ఎడము చేసికొనఁజాలనైతిని. ఇపుడు నెల్లూరి యాంధ్రభాషాభిమాని సమాజమువారు ఏతన్నాటకప్రయోగోత్సుకులై ప్రేరింపఁగా వెండియు నచ్చువేయించుచు గ్రంథమునెల్ల పరిశోధించి కొన్నిమార్పులు శ్రేయము లని నాతలంచినవి యొనర్చితిని.

మదరాసు, ఏప్రిల్, 1903. వేదము - వేంకటరాయశాస్త్రి.

## నాటక పాత్రములు.

| | | | |
|---|---|---|---|
| జీమూతవాహనుఁడు-కథానాయకుఁడు ... | I—V | పురుషుఁడు .. | IV |
| విదూషకుఁడు . | I—III | గరుడుఁడు ... .. | IV V |
| తాపసుఁడు .. .. | I | జీమూతకేతువు-నాయకునితండ్రి | V |
| మిత్రావసువు-నాయికకు అన్న | II—IV | మలయవతి-నాయిక . | I—III, V |
| విటుఁడు ... | III | మనోహరిక-చేటి ... | II |
| చేటుఁడు . | III | చతురిక-చేటి .. | I—III |
| కంచుకి .. | IV | నవమాలిక-చేటి | III |
| ప్రతీహారుఁడు . | IV, V | నాగమాత .. | IV |
| శంఖచూడుఁడు-నాగకుమారుఁడు | IV, V | వృద్ధ-నాయకునితల్లి . | V |
| | | గౌరి | V |

# కథాసంగ్రహము.

---

కథానాయకుఁడు జీమూతవాహనుఁడు. ఈయన విద్యాధరచక్రవర్తియైన జీమూతకేతువుయొక్క కుమారుఁడు. మలయపర్వతములో సిద్ధరాజుకూఁతురు మలయవతి ఈయనను భర్తగాఁ గోరి గౌరినిగూర్చి వ్రత మాచరించి, విద్యాధరచక్రవర్తి తనకు భర్త కాఁగలఁడని వరము పొందినది. వెంటనే జీమూతవాహనుఁడు ఆమెను మలయపర్వతములో వివాహ మాడెను. ఈయన ధీరోదాత్తులలోను ఉత్తమోత్తముఁడు, మహాసత్త్వుఁడు, బోధిసత్త్వుఁడు, దానవీరుఁడు, దయావీరుఁడు, సర్వదా పరోపకారదీక్షితుఁడు. అట్టి యీ మహాపురుషుఁడు వివాహ మయిన పది దినములలోపలనే ఒకనాఁడు మలయపర్వతమునకు తగులుచున్న సముద్రవేలను చూడఁబోయి అక్కడ, పూర్వ మెప్పుడో గరుత్మంతునికిని శేషునికిని జరిగిన నిబంధన ప్రకారము ఆదినము గరుడునికి ఆహారముగా అక్కడికి పంపఁబడిన నాగకుమారునికి బదులుగా తనదేహ మర్పించి వానిని రక్షించెను. ఈలోపల ఇతనిని వెదుకుకొని వచ్చి యీస్థితిలోనుండఁగాఁ జూచి తల్లిదండ్రులును భార్యయు మిక్కిలి పరిదేవింపసాగిరి. అంతట, నాగుఁడే అను భ్రాంతిచేత ఇతనిని అల్పావశిష్టముగా భక్షించిన గరుడుఁడు, ఇతఁడు మహాపురుషుఁడు జీమూతవాహనుఁడని తెలిసికొని పశ్చాత్తప్తుఁడై, ఇతనిని అంతవఱకు తాను తిన్నపాముల కంకాళరాసులను బ్రదికించుటకై అమృతవర్షము గురియింప స్వర్గమునకు పోయెను. ఈలోపల ఇతనిభార్య ఇతఁడు అప్పటికి చక్రవర్తి కానందున గౌరినిగూర్చి ''ఓగౌరీ, నామందభాగ్యతచేత నీవరము కూడ మాయ అయిపోయినది'' అని పరిదేవించెను. అంతట గౌరి ప్రత్యక్షమై ఇతనిని బ్రదికించి చక్రవర్తిగా తానే పట్టాభిషేకము చేసి తనవరమును నెఱవేర్చెను. ఆయవసరములోనే గరుత్మంతుఁడు స్వర్గమునుండి అమృతవర్షము గురియించెను దానిచేత పాములు బ్రదికి జీమూతవాహనుని కొనియాడుచు పాతాళమునకుఁ బోయినవి. ఇట్లు ఈనాటకమునకు నాగానందసంజ్ఞ అన్వర్థమై యున్నది.

---

శ్రీరస్తు

# నాగానందము.



## నాంది.

ఉ. 'ధ్యానమిషంబుదాల్చి యెవతెం దలపోసెద వాసమై? మమున్
గానవె సుంత కన్దెరచి కామశరార్తులఁ. ద్రాత వయ్యునున్
బూనవు కావ, నీకరుణ పూజ్యము. యిందునె యింతకూళ యెం
దేనియు!' నం చసూయ మరునింతులు దూఱుజినుండు ప్రోచుతన్.

మఱియు,

చ. విలు తెగ గొంచు మారుఁడును, బెల్లుగఁ గొట్టుచు ఢక్కఁ దద్భటుల్,
కులుకుమఁ జూపు జంకెనలు గొల్పుచు లేనగ వొప్ప నచ్చరల్,
తెలచుచు సిద్ధ, లబ్బురము తీఱక మై గరుపాఱ నింద్రుఁడున్,
గలఁగని ధ్యాయి నేయమిని గన్గొని రామునిం జా గాచుతన్.

---

## ప్రస్తావన.

నాంద్యంతమున

సూత్రధారుఁడు. — ఏల యతివిస్తరము? ఈదినము ఇంద్రోత్సవములో నానాదిగ్దేశాగతులు శ్రీహర్ష మహారాజ పాదపద్మోపజీవులైన రాజులు నన్ను రావించి సబహుమానముగా నిట్లు సెలవిచ్చినారు —"మాయేలినవారు శ్రీహర్ష మహారాజు గారు అపూర్వవస్తు రచనాలంకృతముగా చేసిన నాగానంద నాటకమును విద్యాధర చక్రవర్తికథను మేము కర్ణపరంపరగా విన్నారమేగాని ఆడఁగాఁ జూడమైతిమి; దానిని నీవు సకలజనహృదయాహ్లాదకరులైన యేలినవారియందలి గౌరవముచేతను మాయందలి యనుగ్రహబుద్ధిచేతను చక్కఁగా ఆడించి మమ్ము కృతార్థులను చేయవలయును" అని. కనుక నేను పోయి వేషము వేసికొని వచ్చి వారియభిలాషను నెఱవేర్చెదను. (పరిక్రమించిచూచి) ఏల సామాజికుల మనస్సులును అప్పుడే ఆకర్షింపఁబడి యున్నవని నిశ్చయముగా తలఁచుచున్నాను. ఏల యనఁగా.

శా. శ్రీ హర్షుండు కృతిప్రణేత సభయుఞ్ జేరె న్గుణగ్రాహి, యెం
తో హృద్యం బగు సిద్ధరాజుకథ, మాతో సాటి లే రాటలో,

నీహాసిద్ధి నొసంగు నొక్కఁ డొకఁడే యిం, దేమి భాగ్యంబొ నేఁ।
డాహా! సర్వ గుణంబులుం గలిగె నాకానందరాజ్యంబుగాఁ!

కనుక నేను క్షణములో ఇంటికి పోయి ఇల్లాలిని పిలుచుకొనివచ్చి సంగీతక మారంభించెదను. (పరిక్రమించి తెరవైపు చూచి) ఇదిగో నాయిల్లు, ప్రవేశించెదను. (ప్రవేశించి) ఆర్యా, కొంచెము ఇటు రా.

నటి.—(ప్రవేశించి, కన్నీళ్లతో,) ఎందుకండీ? ఇదుగో వచ్చినానండి అదృష్ట హీనురాలిని, ఏమిపనో చెప్పండి.

సూత్ర.—(నటిని చూచి) ఆర్యా, నాగానందము ఆడవలసియుండఁగా ఏమి యిట్లు నిష్కారణముగా ఏడ్చుచున్నావు?

నటి.—ఏమండీ, ఏడవక యేలాగుండగలను? ఏమంటే ఇప్పుడే మామగారు అత్తగారితో కూడా తమ ముసలితనాన్ని తలుచుకొని వైరాగ్యం పొంది ఇంటిభారం మోయడానికి మీకు సామర్థ్యం వచ్చింది గదా అని ఆలోచించుకొని తపోవనానికి వెళ్లిపోయినారు.

సూత్ర.—(నిర్వేదముతో) ఏమీ! నన్ను వదలిపెట్టి తపోవనమునకు పోనే పోయినారా నాతల్లిదండ్రులు! కనుక ఇప్పుడు నేనేమి చేయఁదగును? (ఆలోచించి) ఇఁకేమి? గురుచరణ శుశ్రూషా సుఖమును పోఁగొట్టుకొని నేను మాత్రము ఇంట నెట్లుండును?

క. జననిన్ జనకుం గొలిచెద
వనమునకుం బోయి, యిదిగొ, వంశాగతమౌ
తనవిభవ మెల్ల వీడ్కొని,
యనఘుత జీమూతవాహునభ్యాసమునన్.

[నిష్క్రమింతురు.

## ప్రథమాంకము.

[అంతట నాయకుఁడును విదూషకుఁడును ప్రవేశింతురు.]

నాయ.—(నిర్వేదముతో) వయస్యా ఆత్రేయా,

ఆ. అటురిపులమనికి, యాసన్న నాశంబు,
బాగు నోఁగుఁ దేటపడఁగనీదు;
ఇట్టిదయ్యు నాకు హితము లేఁ బ్రాయంబు
పితృపసర్యయందు వెలయుఁ లేని.

విదూషకుఁడు.—(రోషముతో) వయస్యా, నీవు ఇంతకాలం ఈజీవన్మృతులకోసం ఈవనవాసదుఃఖాన్ని అనుభవిస్తూ విరక్తుడవే అయిపోయినావు. ఇకనైనా దయచేసి నామాటవిని యీగురుశుశ్రూషానిర్బంధం వదలించుకొని యథేచ్ఛభోగాలచేత రమణీయమయిన రాజ్యసుఖం అనుభవింతువు రా.

నాయ.—వయస్యా, నీమాట సరి గాదోయి.

చ. జనకుని మ్రోల నేలఁ గల సంపద గద్దియయొక్కఁ గల్గునే?
యొనరునె తత్పదాంబుజము లొత్తఁగ నొధృతి రాజకంబులో?
నెనయె త్రిలోకభోగము తదీప్సితభుక్త్య వశిష్టభుక్తికిన్?
వనటయ గాక యాత్మపితృవర్జికి రాజ్యము మే లొసంగునే?

విదూ.—(స్వగతము, ఆహా ఇతనిగురుశుశ్రూషానురాగం! (ఆలోచించి) కానీ ఈలాగైనా చెప్పి చూస్తాను. (ప్రకాశము) వయస్యా, నేను రాజ్యసుఖాన్ని మాత్రం ఉద్దేశించి ఈలాగు చెప్పలేను, నీకు ఇంకా వేఱేపనికూడా ఉన్నది.

నాయ.—(చిఱునవ్వుతో) వయస్యా, చేయవలసిన దంతయు చేయనే చేసితిని గదవోయి. చూడు,

ఉ. నాయమునం బ్రజన్ నిలిపి, నాసరి బంధులఁ జేసి, పెద్దలన్
హాయిగనుండఁజేసి, తననాటను రక్షణ పాదుకొల్పితిన్,
బాయనికోర్కి మీఱ నిడుపాదపరాజము నర్థి కిచ్చితిన్;
జేయఁగ నేమి గల్గు నిఁకఁ? జెప్పుము మిత్రవ, నీకుఁ దోఁచినన్.

విదూ.—వయస్యా, మహాసాహసికుడు మతంగహతకుడు నీకు శత్రువు వాడు సమీపమందున్నంతకాలం నీరాజ్యం పెద్దమంత్రివిచారణలోనే ఉన్నా నీవు లేక స్థిరమని నాకు తోచదు.

నాయ.— ఛీ మూర్ఖుఁడా! మతంగ హతకుఁడు నా రాజ్యమును హరించు నని భయపడెదవు!

విదూ.—అవును.

నాయ.— అట్లగునేని ఇఁక కాని దే మున్నది! విను, నేను నాశరీరము మొదలుకొని సర్వమును పరులకొఱకే కాపాడుచున్నాను; స్వయముగానే ఏల ఇచ్చివేయ వనఁగా, నాయనగారికొఱకు. కనుక అస త్తయిన యీచింతవలన నేమిప్రయోజనము ? నాయనగారియాజ్ఞను నెఱవేర్చుటయే మేలు. నాయనగారు ఇట్లు ఆజ్ఞాపించియున్నారు —“నాయనా, జీమూతవాహనా, బహుదివసానుభవముచేత ఇక్కడ కందమూలఫలనీవారములు సమిధలు పుష్పములును ప్రాయికముగా అయిపోయినవి. కనుక మలయపర్వతమునకు పోయి అక్కడ నివాసయోగ్యమయిన యాశ్రమస్థాన మొకటి చూచుకొనిరా” అని.—కనుక మలయపర్వతమునకే పోదము రా.

విదూ.—చిత్తం. రా మఱి. [ఇద్దఱును పరిక్రమింతురు]

విదూ.—(ఎదుట చూచి) వయస్యా, చూడు చూడు, ఇదిగో సరసములయిన గంధపుచెట్లవీధులలో విసరడంచేత పరిమళవంతమై, యెత్తయిన కొండదరియల నుండి పడి పాఱుతున్న చీలి రేగి చెదురుతూఉన్న సెలయేళ్ల తుంపురులను మోసుకొని వచ్చి, యీమలయమారుతం తొలిసంగమానికై గటకలు మింగుతూ ఉన్న ప్రియభామ కంఠపుకౌగిలింతవలెనే మార్గశ్రమను పోగొట్టుతూ నాప్రియవయస్యుని గగుర్పాటు నేలాగు చేస్తూ ఉన్నది.

నాయ.—(చూచి ఆశ్చర్యముతో) ఓహో మనము అప్పుడే మలయపర్వతమునకు రానే వచ్చినారము! (అన్నివైపులను చూచి) ఆహా! దీనిసొంపు!

చ. ఘనముగ రేఁగి దిక్కరులు గండము రాయఁగఁ బాలుగారు చం
దనముల, నబ్ధివీచికరతాడనచే నొదవెట్టు పెన్గుహల్,
దనపయి నాడు సిద్ధవనితానివహంబులపాదలాక్షచే
ననయము కందుముత్తెముల, నాత్మకు నీనగ మిచ్చు మోదముల్.

కనుక దీనిమీఁద నెక్కి వాసయోగ్యమయిన యాశ్రమస్థాన మొకటి నిరూపింతము.

విదూ.—అలాగే చేతాం. (ముందునిలిచి) రా మరి.

[ఆరోహణమును అభినయింతురు.]

నాయ—(కుడికన్నదరుటను సూచించి) ఓహో!

క. వలక న్నదరెను, నా కే । వలనను ఫలకాంక్ష లేదు, వరమునివచనం
బు లళీకము గా నోపవు । కలిగింపఁగొ నా కి దేమికల్యాణంబున్?

విదూ.—వయస్యా, అవశ్యంగా నీకు దగ్గర నేవున్నశుభాన్ని తెలుపుచున్నది,

నాయ.—నీ వన్నట్లే అగును గాక.

విదూ.—(చూచి) వయస్యా, చూడు మాడు. ఇక్కడ చెట్లు మిక్కిలి దట్టమై మెఱుఁగెక్కి యున్నవి; హవిస్సుయొక్క పరిమళాన్ని వెదచల్లుతూ హోమధూమం లేస్తున్నది; లేడిపిల్లలమంద నిర్భయంగా సుఖంగా పరుండే యున్నది. ఇది యొకతపోవనం గాబోలు.

నాయ.—బాగుగా నే గ్రహించినాఁడవు. తపోవనమే యిది, కనుక నేయిక్కడ.

మ. తరులం దింపక చీరకై కరుణచేత న్నార యొల్వంబడెన్;
ఝురి నచ్ఛాంబువు క్రింద జీర్ణకరకాంశవ్రాతము ల్గాన నౌఁ;
బురి ద్రెవ్వన్ వటువుల్ త్యజించిన వివే ముంజావళీ మేఖలల్;
నిరతంబున్ వినికిన్ శుకం బమృతవాణిం బాడు సామంబులన్.

రా లోపలికి పోయి చూతము. [ప్రవేశము నభినయింతురు.

నాయ.—(చూచి ఆశ్చర్యముతో) ఆహా! ఇచ్చట మునిజనులు సంతోషముతో వేదవాక్యములయందలి సందేహములను విచారించుకొనుచున్నారు. వటువులు వేదమును చదువుచునే తడి సమిధలను విఱుచుచున్నారు. ఆహా యీతపోవనము ఎంతప్రశాంతముగాను ఎంతరమణీయముగాను ఉన్నది! మఱియు నిక్కడ,

మాలి. అళులమధురగీతిన్ స్వాగతంబున్ వచించున్,
ఫలభరనతశాఖిన్ భక్తి జోహారొనర్చున్,
గలయఁ గుసుమవృష్టిన్ గామితార్ఘ్యం బొసంగున్,
జెలి యతిథిసపర్యన్ జెట్లునన్ జేయు నౌరా!

కనుక ఈచోటు నివాసయోగ్యము ఇక్కడ వసింతు మేని మనకు సుఖము గలుగు నని తలఁచెదను.

విదూ.—వయస్యుడా, ఇ దేమిటి? ఈలేళ్లు మెడ కొంచెం తిప్పి నోరుమెదపక, కసిగాట్లు పడియున్న దర్భకబళాలు జాఱి పడిపోతూ ఉండగా, ఎట్టని చెవి ఒకటిమాత్రము నిక్కఁబెట్టుకొని, సుఖంచేత కళ్లు మూసుకొని, ఏమిటో వింటూ ఉన్నట్టు అవుపడుతున్నవి?

నాయ.—(చెవియొగ్గి) మిత్రమా చక్కఁగా కనుఁగొంటివి. ఆక్లేసుమా,

స్రగ్ధ. స్థానప్రాప్తిన్ స్ఫుటం బై తనరఁగ సమతాతారమంద్రవ్యవస్థల్,
స్వాన శ్రీమద్విపంచీస్వరమున నళినీరుఝంకృతిం బోలెఁ జేరన్,
కానన్ మై వంచి, దంతాగ్రగతతృణకబళగ్రాసశబ్దంబు మాయన్,
వీనొందే నిక్క లేదు ల్విశదపదమధుస్ఫీతి నాలించు గీతిన్.

విదూ.—వయస్యా, ఎవరు వారు, తపోవనంలో పాడుతున్నారు?

నాయ.—కోమలములయిన వ్రేళ్లతో వాయింపఁబడుచున్నదై తంత్రులు స్ఫుటముగా ధ్వనించుట చూడఁగా కాకలీప్రధానముగా గానము జరుగుచున్నదని తోఁచుచున్నది. (వ్రేలితో ఎదుటచూపుచు) ఈదేవాలయమందు ఎవతెయో ఒకదివ్య కన్య దేవతను ఆరాధించునదై వీణాసేవ చేయుచున్నది.

విదూ.—వయస్యుడా, మనముకూడా దేవాలయం చూతాం.

నాయ.—వయస్యా, చక్కఁగా చెప్పితివోయి. దేవతలను నమస్కరింపవలసినది గదా. (పోవుచు, తటాలున నిలిచి,) మిత్రమా, ఒకవేళ ఆదివ్యాంగనను మనము చూచుట తప్పిదమగు నేమో? గనుక మనము ఈచీఁకటిచెట్లగుబురుచాటున నిలిచి సమయము నెదురుచూచుచుందము. [అట్లు చేయుదురు.

[అంతట నేలఁ గూర్చుండి వీణ వాయించుచున్నదై మలయవతియు
చేటియు ప్రవేశింతురు. నాయిక పాడును.]

మత్త. కోర రానిది కోరితిన్, సముకూరు నం చెదఁ గోరఁగా
నేర; నీకరుణారసంబున నేరుతుర్ దరి సేరఁగా,
నీరజోదరభూజరంబున నేర మెంచెదుసారు చె
న్నారుమే గలగౌరి, నై కొనుమా రయంబున నారతిన్,

నాయ.—(చెవియొగ్గి) వయస్యా, ఆహా! ఏమిగానము! ఏమివాద్యము!

శా. ప్రాపై వ్యంజనధాతువుల్ పదియు సంపాదించె వ్యక్తిం గడున్,
వ్యాపించెన్ లయ మధ్యమద్రుతవిలంబచ్ఛిన్నమై తెల్లమై,
గోపుచ్ఛప్రముఖంబు లౌయతులు సేగూర్చెన్ రహిన్ మూఁడునున్,
జూపంగాఁబడెఁ దత్త్వపూర్వకములై సొంపొందువాద్యక్రియల్.

చేటి.—(చనవుతో) భర్తృదారికా, శానాసేపట్నుంచి వాయిస్తూ ఉన్నావు గదా, నీవేళ్లు ఎందుచేత నొప్పి పెట్టడం లేదు?

నాయిక.—(అధిక్షేపముతో) ఒసే, దేవియెదట వీణ వాయిస్తున్న నావేళ్లకు నొప్పిఎందుకు కలుగునే?

చేటి.—భర్తృదారికా, నేను చెప్తాను కదా, కనికరము లేని యీ అమ్మవారియెదుట ఎంత వాయించినా యేమి ప్రయోజనం? ఈమెను కన్యలకు సాధ్యంగాని నీమాలతోటిన్ని ఉపోష్యాలతోటిన్ని కొలిచినావుగదా ఇప్పటికైనా ప్రసన్నం అయిందా?

విదూ.—కన్యకసుమీ ఈవిడ. మనం చూడడానికి ఏమీ ఆక్షేపం లేదు.

నాయ.—దోషమేమి. కన్యలను చూచుటయందు దోషమేమియులేదు. అయినను ఒకవేళ మనలను చూచి బాల్యస్వభావమువలనిభయముచేత ఇక్కడ చాల సేపు నిలువకపోయినను పోవును. కనుక ఈచీఁకటిచెట్లచాటునుండియే చూచుచుందము.

విదూ.—(చూచి ఆశ్చర్యపడి) వయస్యుడా, చూడు చూడు. ఆహా ఆశ్చర్యం! వీణావిజ్ఞానంచేతమాత్రమే ఆనందంగలిగించడంగాదు, వీణావిజ్ఞానానికి అనురూపమయిన యీరూపంచేతకూడా కళ్లకు పండగచేస్తూఉన్నది! ఈమె యెవతె? దేవకన్యా? కాక నాగకన్యా? అదీ గాకపోతే విద్యాధరకన్యా? లేక సిద్ధకన్యకా?

నాయ.—(కాంక్షతో చూచుచు) మిత్రమా, ఈమోహనాంగి ఎవరో ఎఱుఁగనుగాని ఇదిమాత్రము ఎఱుఁగుదును.

శా॥ దేవస్త్రీయగునేని ధన్యము లగుఁ దేవేంద్రునేత్రంబులున్;
గ్లావర్గంబె భుజంగియేని బలిలోకం బీముఖంబుండఁ గాఁ?
మావిద్యాధరి యేని జాతివితతిన్ మాజాతియే శ్రేష్ఠ యౌఁ,
శ్రీవిఖ్యాతులు సిద్ధభామ యయినన్ సిద్ధజగన్మండలిన్.

విదూ.—(నాయకుని చూచి హర్షముతో స్వగతము) భళి! ఎట్టకేలానికి ఇతడు ఇప్పటికి మన్మథునికి గోచరంలో పడ్డాడు. (తన్నే నిర్దేశించి భోజన మభినయించి) కాదుకాదు బ్రాహ్మణుయిన నా ఒక్కనికే.

చేటి —(చనవుతో) భర్తృదారికా, నేను చెస్తాను గదా, కనికరం లేని యీమె ముందర వాయించి యేమిఫలం? [అని వీణను పట్టిలాగును.

నాయిక.—(కోపముతో) ఒసే, అమ్మవారిని ఆక్షేపించకు; ఇప్పుడే నాకు అమ్మవారు ప్రసాదం చేసింది.

చేటి.—(హర్షముతో) భర్తృదారికా, అయితే చెప్పవమ్మా ఏమి ప్రసాదమో.

నాయిక.—వినవే చెప్తాను. ఇప్పుడే కలలో ఈవీణనే నేను వాయిస్తూ ఉండగా అమ్మవారు ఈలాగు సెలవిచ్చింది;—ఓసే వత్సామలయవతీ, నీయీవీణావిజ్ఞానాతిశయానికిన్ని బాలాజనదుష్కరమయిన యీ నామీది భక్తికిన్ని మెచ్చుకొన్నాను. నీకు విద్యాధర చక్రవర్తి శీఘ్రంగా భర్త కాగలడులే" అని.

చేటి.—(హర్షముతో) భర్తృదారికా, ఆలాగైతే దీన్ని కల అనడ మెందుకు? నీమనస్సులోని వరదానమేగదా దేవి చేసింది.

విదూ.—(విని) ఇదే నోయి మనకు అమ్మవారిదర్శనానికి సమయం. వెళ్దాంరా.

నాయ.—నేను ఇప్పుడిప్పుడే రాను.

విదూ.—(నాయకునికి ఇష్టము కాకపోయినను అతనిని బలవంతముగా లాగుకొనిపోయి) అమ్మా, నీకు స్వస్తి, అయ్యో, చతురిక చెప్పినమాటనిజమే, దేవిచేసింది వరదానమేను.

నాయిక.—(భయముతో లేచుచు నాయకుని ఉద్దేశించి) ఒసే, ఈయన ఎవరే?

చేటి.—(నాయకుని చక్కగా చూచి అపవారించి) సాటులేని ఈయాకారం చేత అమ్మవారు దయచేసినవరుడు ఈయనే అని నాకు తోస్తుంది.

[నాయిక కాంక్షతోను లజ్జతోను నాయకుని చూచుచుండును.

నాయ

ద్రుత. బిసరుహాయతవీక్షణ, నీదుమై
విసివి నెంతయు వేఁడితపంబుచే,
శ్వసితకంపితసాంద్రఘనస్తనీ,
కొసరి యేఁగెదు కోమలి యే మిఁకన్ ?

నాయిక.—(అపవారించి) ఒసే, అతిభయంచేత ఈయనయెడట నిలవడానికి కూడా నావల్ల గాలేదే॥ [నాయకుని క్రేగంట లజ్జతో చూచుచు కొంచెము పెడమొగముగా నిలుచును

చేటి.—భర్తృదారికా, ఏమిటి ఇది?

నాయిక. ఒసే, ఈయనదగ్గిర నేను నిలువను కూడా లేనే. రావే అవతలికి పోదాం. [పోఁబోవును.

విదూ.—ఓహో! ఈవిడ భయపడుతూవుంది సుమా. నేను చదివిన కవులాగు ఈవిడను రవంత సేపు నిలుపుతాన.

నాయ.—దోష మేమి?

విదూ.—ఏ మమ్మా ఏమి మీ తపోవనంలో ఇదేనా ఆచారం, వచ్చిన అతిథిని మాటమాత్రంచేత నయినా ఆదరించరు?

చేటి. —(నాయికను చూచి స్వగతము) ఈయనమీద ఈవిడచూపు మరులుకొన్నట్టు ఉన్నది. ఈలాగు చెప్పి చూస్తాను:-—(ప్రకాశము) భర్తృదారికా, అయ్యవారు చెప్పినమాట సరిగానే ఉన్నది. అతిథిమర్యాద నీవు చెయ్యవలసిందేగదా. అలా గుండగా ఇటువంటి గొప్పవారివిషయంలో ఏమి తోచక నిర్భ్రాంతపోయి ఉన్నావేమి? పోనీ నీవు ఊరకో, నేనే వారిని మర్యాద చేస్తాను. (నాయకుని ఉద్దేశించి) అయ్యా, విజయం చేయండి. ఈ ఆసనంమీద కూర్చుండి అయ్యగారు ఈచోటిని అలంకరింతురుగాక.

నాయిక.—(చేటిని ఉద్దేశించి) ఒసే, వేళాకోళపుమనిషీ, ఈలాగుచేయకు; ఒకవేళ ఎవరయినా తాపసులు చూచేరు, అంతటితో నన్ను అయోగ్యురాలినిగా తలచేరు.

[అంతట తాపసుఁడు ప్రవేశించును.]

తాప.—కులపతులు కౌశికులవారు ఆజ్ఞాపించినారు. ఏమనఁగా,—'వత్సా శాండిల్యా, భవిష్యద్విద్యాధరచక్రవర్తి కుమారజీమూతవాహనుఁడు ఈమలయపర్వతమునకు వచ్చియున్నాఁడు. అతనిని సిద్ధయువరాజు మిత్రావసువు తండ్రియాజ్ఞమీఁద తనచెల్లెలు మలయవతికి వరునిఁగాఁ వేడుటకు చూడఁబోయియున్నాఁడు. అతనిని ఎదురుచూచుచు మలయవతి ఒకవేళ మధ్యాహ్నసవనకాలమును అతిక్రమించినను అతిక్రమించును. కనుక ఆమెను పిలుచుకొనిరా'' అని. కనుక తపోవనముండలి గౌరీగృహమునకే పోయెదను. (పరిక్రమించి భూమిని నిరూపించి ఆశ్చర్యముతో) ఓహో! ఎవనిది ఇది, ధూళిమయమైన యీప్రదేశములో స్పష్టమైన చక్రరేఖగల పదపంక్తి? (ఎదుట జీమూతవాహనుని నిర్దేశించి) నిశ్చయముగా ఈమహాపురుషునిదే అయ్యెఁ గదా;

శా. శ్రీ వీనికి విలసిల్లు మూర్ధమున నుష్ణీషంబు; భ్రూమధ్య మూ
ర్ణావర్తాంకము, కన్ను తమ్మి, యురమా హార్యవక్షమే, చక్రరే
ఖావిభ్రాజి పదద్వయం బిగియు, వీఁకిం జూడ నీతం డేవం
డో విద్యాధరచక్రవర్తిపదవిగ్రహుఁడు గాకుండునే?

సరి! ఇఁక సందేహ మేమి? తెలిసినది, ఇతఁడే జీమూతవాహనుఁడు గావలయును. (మలయవతిని చూచి) ఆహా ఈరాజపుత్రికూడ ఇక్కడనే యున్నది! (ఇద్దఱం జూచి) అన్యోన్యానురూపులయిన యీయిద్దఱను కూర్చునెడల, బ్రహ్మదే

వుఁడు చిరకాలమునకుఁజూమా ఉచితము చేయువాఁ డగును, (సమీపించి నాయకుని నిర్దేశించి) అయ్యా, నీకు స్వస్తి.

నాయ.—స్వామీ, జీమూతవాహనుఁడు నమస్కారము చేయుచున్నాఁడు.

[అని లేవఁబోవును.

తాప.—లేవ వలదు లేవ వలదు. అభ్యాగతుఁడు అందఱకును గురువు, నీవే మాకు పూజ్యుఁడవు, కనుక యథాసుఖముగా నుండుము.

నాయిక.—ఆర్యా, నమస్కారము.

తాప.—(నాయికను నిర్దేశించి) వత్సా, అనురూపుఁ డగుభర్తను పొందుదువుగాక. రాజపుత్రి, కులపతులు కౌశికులవారు చెప్పుచున్నారు, మధ్యందిన సవన వేళ అతిక్రమించుచున్నది త్వరగా రమ్మని.

నాయిక.—గురువుగారి యాజ్ఞ. (స్వగతము) ఒకవైపున గుర్వాజ్ఞ, ఒకవైపున ప్రియదర్శనసుఖం, అని రాకపోకల నవలంబించి ఇప్పటికిన్ని నా హృదయం నన్ను ఉయ్యాల ఊపుతున్నది. [లేచి నిశ్వసించి లజ్జతోను అనురాగముతోను నాయకుని చూచుచు తాపసునితోఁగూడ నిష్క్రమించును.

నాయ.—(ఉత్కంఠతో నిశ్వసించి, నాయికను చూచుచు,)

క. ఘనజఘనాభోగభరం
బున నీపూఁబోఁడి మందముగ నవ్వలికిన్
ననుఁ బాసి యేఁగినది య
య్యును నాహృదయమునఁ బదము నుంచెఁ దిరముగాన్.

విదూ.—నూడవలిసినదాన్ని చూచినావు గదా, ఇకను ఇప్పుడు మధ్యాహ్న సూర్యకిరణసంతాపంచేత కెట్టింపినట్లు నాజఠరాగ్ని భగ భగ మండుతున్నది గనుక వెళ్దాం రా. నేను బ్రాహ్మణ్ణి అతిథినై మునీశ్వరులవల్ల దొరికే కందమూలఫలాలచేతనైనా ప్రాణాలు నిలుపుకొంటాను.

నాయ.—(పైని చూచి) వేయికిరణముల వేలుపు ఆకాశములో నట్టనడుమనున్నాఁడు. కనుకనే ఎండచేత.

శా. గాసిన్ సైఁపక ఘృష్టచందనరసౌఘ శ్వేతగండాద్రినై,
యాసక్తశ్రుతితాళవృంత పవమానాసీజ్వమానస్యమై,
నాసాప్రోజ్ఝితశీకరంపుజడివానన్ బోమ్మునన్ గ్రమ్ముచున్,
వాప్తిం బాసీనవాడుసల్లకము లేవన్ హస్తిరా జొప్పెడున్.

[అందఱు నిష్క్రమింతురు.

## ప్రవేశకము.

---

[ అంతట చేటి ప్రవేశించును. ]

చేటి.—భర్తృదారిక మలయవతి ఆజ్ఞాపించినది; ఏమంటే,—“ఓసే మనోహరికా, ఈవేళ మాఅన్నయ్యమిత్రావసువు ఆలస్యంచేస్తున్నాడు. నీవు వెళ్లి తెలుసుకొని రావే వచ్చినాడో లేదో” అని. (పరిక్రమించి తెరవైపు చూచి,) ఎవ రీ మనిషి, త్వరత్వరగా ఇక్కడికే వస్తూఉంది? ఎవరూ? (నిరూపించి) చతురిక గదా.

[అంతట రెండవచేటి ప్రవేశించును.]

మొదటిది. —(సమీపించి) ఒసే చతురికా, ఎందుచేత నే నాకేసిచూడనైనా చూడకుండా ఈలాగు త్వరత్వరగా వెళ్తూవున్నావు?

రెండవది. —(సమీపించి) ఒసే మనోహరికా, భర్తృదారిక మలయవతి ఆజ్ఞాపించినది —“ఒసే చతురికా, పువ్వులు కోసి కోసి నా అలిసిపోయినాను, మబ్బు విడిచినయెండలాగు తాపం నాఒళ్లంతా వేయిస్తున్నది. నీవు వెళ్లి లేతఅరిటాకులు చుట్టూ కమ్ముకొని వున్న గంథపుతీగయింట చంద్రకాంతపు అరుగును బాగుచెయ్యవే” అని నేనున్ను ఆపని చేసివేసినాను. వెళ్లి ఆమాట భర్తృదారికతో చెప్తాను.

[నిష్క్రమింతురు.

—ౘౘ—

## ద్వితీయాంకము.

[అంతట ఉత్కంఠితురాలై మలయవతియు, చేటియు, ప్రవేశింతురు.]

మలయ.—(నిశ్వసించి స్వగతము) ఓమనసా, ఆప్రకారం ఆయనయొద్దినుండి నాముఖాన్ని లజ్జచేత మళ్లించివేసి, నీవుమాత్రం ఆయనదగ్గిరికే స్వయంగా వెళ్లినావు గదా! ఆహా నీ ఒంటెత్తుతనము! (ప్రకాశము) ఒసేచతురికా, దేవాలయానికి దోవ చూపవే.

చేటి.—(స్వగతము) గంధఫలీగయింటికి బైలుదేరిన యీవిడ ఇప్పుడు దేవళ మంటూవున్నది! (ప్రకాశము) భర్తృదారిక గంధఫలీగయింటికి బైలుదేరినది.

నాయిక.—(లజ్జతో) ఒసే, బాగా నేజ్ఞాపకం చేసినావు. అక్కడికే వెళ్దాంపద.

చేటి.—రావమ్మా భర్తృదారికా. [నాయిక పెడదారిని పోవుచున్నది.

చేటి —(వెనకకు తిరిగిచూచి భయముతో ఆత్మగతము) ఆహా యీవిడకు ఎంత పరధ్యానం! ఏమీ! మళ్ళీ అదే దేవళానికే వెళ్తూవుంది! (ప్రకాశము) భర్తృదారికా, ఇటుకేసి గదా గంధఫలీగయిల్లు, ఇటుకేసి రావమ్మా.

[నాయిక మందముగా వెడవెడనవ్వుచు అట్లే చేయుచున్నది.

చేటి.—ఇదుగో నమ్మా గంధఫలీగయిల్లు, ఇంగులోకి వెళ్లి చంద్రకాంతపరుగు మీదకూర్చుండి అలుపుతీర్చుకోవమ్మా. [ఇద్దఱును కూర్చుందురు.

నాయిక.—(నిశ్వసించి ఆత్మగతము) ఓదేవా పుష్పబాణుడా, నిన్నెవరు రూపంచేత గెలిచివేసినారో ఆయనను నీవేమీ చేయలేకపోయినావు, నిరపరాధినైన నన్ను అబల ననియెరిగి కొట్టుతూ లజ్జలేకుండా వున్నావు. (తన్ను చూచుకొని మదనావస్థను నటించుచు, ప్రకాశము) ఒసే, మునుపటిదే యీగంధఫలీగయిల్లు దట్టమయిన చిగురుటాకులగుబురుచేత సూర్యకిరణాన్ని చొరనియ్యక ఉండిన్ని ఇప్పుడు నాసంతాపాన్ని పోగొట్టడం లేదేమి?

చేటి.—ఈసంతాపానికి కారణం నేనెరుగుదును; అయినా గాని, భర్తృదారిక అలాగు తలవగు గనక, నామాట నమ్మదు.

నాయిక.—(ఆత్మగతము) ఇది నాగుట్టు కనిపట్టినట్టున్నది. అయినాఅడుగుతాను. (ప్రకాశము) ఒసే, ఏమిటే అనమ్మనిమాట? దాన్ని రవంత చెప్పవే చూతాం; ఏమిటి ఆకారణం?

చేటి.—ఇదుగో నీమనస్సులోని వరుడు.

నాయిక. —(హర్ష సంభ్రమములతో లేచి గెండుమూడడుగులునడిచి) ఏరీ ఏరీ ఆయన ఎక్కడ ?

చేటి.—(లేచి చిఱునవ్వుతో) భర్తృదారికా, ఆయ నెవరు ఆయన ?

[నాయిక లజ్జపడి తలవంచుకొని కూర్చుండును.

చేటి —భర్తృదారికా, ఈమాట విను; నీమనసులో నున్నవరుణ్ణే అమ్మవారు నీకు ప్రసాదంచేశింది, వెంటనే, ఆయనను, పువ్వులవింటిని వదలివేసివచ్చిన మన్మథునిలాగ, భర్తృదారిక స్వయంగానే ప్రత్యక్షంగానే మాశింది ఆయనే యీ వేడికి కారణం. అందుచేతనే స్వభావముగా చలవైన యీగంధపుతీగయిల్లు నీతాపాన్నిపోగొట్టలేకున్నది.

నాయిక.—(ఆత్మగతము) చతురిక నన్ను కనిపట్టి వేసినది. (ప్రకాశము) ఒనే, నీమాట నిజమేనే, చతురికవు గదా నీవు. ఇక నీదగ్గర దాచడ మెందుకు ? చెస్తాను విను.

చేటి.—భర్తృదారికా, ఇప్పుడే తెలిసింది గదా. వేయేల? తొందరపడకు తొందరపడకు సంతాపపడకు. నేనే గనక చతురిక నైతే, ఆయన కూడా భర్తృదారికమీద మరులుచేత ఒకక్షణంసేపైనా వెతిలబడక ఉండలేడు. ఇది కూడా నేను కని పెట్టినాను.

నాయిక. —(కన్నీళ్లతో) నా కెక్కడిదే అంతటిపుణ్యం !

చేటి.—భర్తృదారికా, ఆలాగున అనకు, ఎదను లక్ష్మిని ధరింపక నారాయణమూర్తి సుఖపడునా ?

నాయిక —మంచివారు ప్రియం తప్ప మరియొకటి చెప్ప నేర్తురా? ఓ చెలీ, ఇందుచేత కూడా నాసంతాపం నన్నుమరీ యెక్కువగా బాధిస్తూఉన్నది, ఎందుచేత నంటే, ఆమహానుభావుని నేను మాటమాత్రం చేతనైనా గౌరవింపకపోతిని గదా. ఆయన నన్ను మర్యాదయెఱగని పెడతనపుదాన్నిగా భావించకపోవునా !

[అని యేడ్చును.

చేటి.—భర్తృదారికా, ఏడవకు, ఏడవకు.(ఆత్మగతము)అయినా గానీ ఏలాగు ఏడవకుండా ఉండగలదు. ఈవిడకు మనసులో సంతాపం ఎక్కువౌతూఉంది. మరీ మరీ ఎక్కువగా బాధిస్తూ ఉంది. ఇందుకు ఇప్పుడు ఏమిచేతును? సద్యా ఈగంధపు చిగుళ్ల పసరు రొమ్ముమీద పూస్తాను (లేచి చందనపుఁజిగుళ్లను తీసికొని పిడిచి హృదయమున పూయుచు, (ప్రకాశము) భర్తృదారికా, నేను బతిమాలుకొంటున్నానుగదా, ఏడవకు, ఈగంధపుపసరు ఎడతెంపులేకుండా రాలుతూఉంటే ఈ

బాష్పాలచేత గనక వే డెక్కనా, నీహృదయంలోని సంతాపాన్ని పోగొట్ట నేరదు సుమా. [అరఁటియాకుతో విసరును.

నాయక.—(చేతితో నివారించుచు) చెలీ; విసరకు విసరకు. ఈలేతరిటాకు గాలి వేండ్రంగా ఉన్నది.

చేటి.—భ ర్తృదారికా, దీనిమీద తప్పు చెప్పకు. నీవే గంధపుచిగుళ్ల సంపర్కంచేత చలవైన యీ లేతఅరిటాకువిసనకఱ్ఱగాలిని నీనిట్టూర్పులచేత విరివిచేసి ఉడికిస్తూఉన్నావు.

నాయిక.—(కన్నీళ్లతో) చెలియా, ఈదుఃఖానికి ఉపశమోపాయము ఏమయినా ఉండునా?

చేటి.—భ ర్తృదారికా, ఉన్నది, ఆయన ఇక్కడికి వస్తే,

[అంతట నాయకుఁడును విదూషకుఁడును ప్రవేశింతురు.]

నాయ —

ఉ. నీలసితేక్షణప్రభల నించి మునీంద్రవనీద్రుమంబులన్
వ్రేలుమృగాజినౌఘ మనువిభ్రమముగ్ మొలపించి మించుచున్
బాలికవాలుచూపు మునివర్యుఁడు సాక్షిగ నొంచె నన్ను, నీ
వేల వృథా ఝుషాంక యిటు లేసెదు నాపయి నీ శరంబులన్?

విదూ.—వయస్యా, నీయాధైర్యం ఏమయి పోయిందోయి?

నాయ.—వయస్యా, అట్లుగాదోయి, ధీరుఁడనే అగుదును. ఎట్లనగా:—

చ. సలుపనె చంద్రికాధవళశర్వరులన్? దొగతావిఁ గ్రోలనే?
నిలువనె జాజిసౌరభము నించునిశాస్యసమీరణంబులో?
నళులు మదించి మ్రోయఁ గమలాకరపుందటి నాలకింపనే?
చెలి, యెటు నన్నధీరుఁ డనఁ జెల్లుదు పీ విట లాఁతికై వడిన్?

(ఆలోచించి) అయినను నీమాట అబద్ధము గాదు. వయస్యా, ఆత్రేయా, అవునోయి అధీరుఁడనే అగుదును —

క. ఏసినవీరుఁ డనంగుం। డేసినబాణంబు లలరు, లెలనాగయె నా
నే సైఁపక డస్సితి,సీ। వే సాక్షిగ, ధీరుఁడ నని యెట్లు వచింతున్?

విదూ.—(ఆత్మగతము) ఈలాగు తనయధీరత్వాన్ని చెప్పకొని యితను తన హృదయంలోని మహత్తరమయిన సంతాపాన్ని బైలుపెట్టినాడు. కాని, ఇతనిమనస్సును ఈవిషయంనుంచి మరియొకవిషయంమీదికి మళ్లిస్తాను. (ప్రకాశము) వయస్యా, ఏమి నీవు ఈదినం ఇంతత్వరగా గురుశుశ్రూష ముగించి ఇక్కడికి వచ్చినావు?

నాయ.—ఆత్రేయా, నీప్రశ్న ఉచితమే, తోఁ గాక మఱియెవరితో చెప్పుదును? నిన్న రాత్రి స్వప్నములో చూచితిని—ఆప్రియనే, (వ్రేలితో చూపుచు) ఈచందనలతాగృహమందే, చంద్రకాంతవేదికమీఁద కూర్చున్నదై పొలయలుకచేత నన్నేమో దూఱునదియుంబోలె ఏడ్చుచుండఁగా—చూచితిని. కనుక స్వప్నానుభూతప్రియాసమాగమముచే రమణీయమయిన యీచందనలతాగృహమందు ఈదినశేషమును గడుపఁ గోరియున్నాను. కనుక అక్కడికే పోదము పద. [పరిక్రమింతురు.

చేటి.—(చెవి యొడ్డి సంభ్రమముతో) భర్తృదారికా, అడుగులచప్పుడు లాగు వినబడుతున్నది.

నాయిక,—(సంభ్రమముతో తన్నుచూచుకొనుచు) ఒసే, ఈయాకారం చూస్తే ఎవరైనా నాహృదయం కనిపెట్టివేస్తారు; కనుక లేవె ఈయెఱ్ఱఅశోకంచాటున నిలిచి ఈయన యెవరో చూతాం. [అట్లు చేయుదురు.

విదూ.—వయస్యా, అదుగో చందనలతాగృహం. రా ప్రవేశింతాం.

[నాట్యముతో ప్రవేశింతురు.

నాయ.—

క. చందనలతాగృహం బిది। చంద్రశిలాసహిత మయ్యు సౌరు గులుక, దా
చంద్రానన లేకునికిఁ। జంద్రిక లేకిఁరులుకొనునిశాముఖమువలెన్.

చేటి.—(చూచి) భర్తృదారికా, భళీ!నీ అదృష్టమే ఆదృష్టం! నీమనోవల్లభుఁడే ఈవచ్చినాయన.

నాయిక.—(చూచి హర్షముతోను భయముతోను) ఒసే, ఈయనను చూచి అతిభయంచేత ఈయనదగ్గిర ఇక్కడ నిలువజాలకున్నాను. ఈయన నన్ను ఒకవేళ చూచినా చూచును. అవతలికి పోదాం రా. (ఉత్కంఠతో ఒకయడుగు నడిచి) ఒసే, ఒసే, ఇదేమిటే నాయడుమతొడ అదురుతూఉన్నది!

చేటి.—(నవ్వి) ఎంత బేలతనమమ్మా! ఇక్కడుండేటినిన్నెవరు చూడగలరు? ఈయెఱ్ఱఅశోకాన్నిమఱిచిపోయినావుగా? ఇక్కడనే కూర్చుందాం. [అట్లు చేయుదురు.

విదూ.—(చూచి) వయస్యా, ఇదే ఆచంద్రకాంతవేదిక.

[నాయకుఁడు కన్నీళ్లు విడుచుచు నిశ్వసించును.

చేటి.—భర్తృదారికా, కలలోనిసంగతని తోస్తుంది, శ్రద్ధగా విందాం గానీ. [ఇద్దఱును ఆలకింతురు.

విదూ.—(చేతి తోకదపుచు) ఓవయస్యా, చెపుతున్నానుగదా 'ఇదే ఆచంద్రకాంతవేదిక' అని.

నాయ.—(కన్నీళ్లతో, నిశ్వసించి,) చక్కఁగా కనిపట్టితివి; (చేతితో చూపి)

చ. విను, మిద యీశశాంకమణివేదిక, యిం దతిమాత్రపాండురా
ననమును వామపాణినలినంబునఁ జేరిచి వెచ్చ నూర్చి, నేఁ
జన నెడ గాఁగ గుర్తు విడి, చక్కరమోవి నటింప నేడ్చునా
వనజదళాయతాక్షిఁ గనఁ, బాసెను నావెత లెల్ల నొక్కటన్.

కనుక ఆచంద్రకాంతవేదికయందే కూర్చుందము. [ఇద్దఱును కూర్చుందురు.

నాయిక.—(ఆలోచించి) ఆమె ఎవరై యుండును?

చేటి.—భర్తృదారికా, మనం చాటున ఉండి ఈయనను ఏలాగు చూస్తు స్నామో ఆలాగే ఈయన నిన్నే చూచియుండును సుమా.

నాయిక.—బాగానే ఉన్నది అమాట. అయినా, పొలయలుక వహించిన ప్రాణనాయికను గురించి చెప్పతూ ఉన్నాడే?

చేటి.—భర్తృదారికా, ఈయనుమాన మెందుకులే? కానీ మళ్లీవిందాం,

విదూ.—(ఆత్మగతము) ఈప్రస్తాపం ఇతనికి ప్రియంగా ఉన్నది. దీన్నే సాగిస్తాను. (ప్రకాశము) వయస్యా, ఏడుస్తూఉన్న ఆవిడతో నీ వే మన్నావు?

నాయ.—వయస్యా, ఇట్లన్నాఁడను,

క. 'నీమోము నెలపొడుపుచేఁ । దామరసారాతిమణివితర్ది జిలజిలన్
దేమగిలుచున్నదో యనఁ । గోమలి, నీబాష్పవారిఁ గొమ రొప్పారున్.'

నాయిక.—(కోపముతో) చతురికా, ఇకనుకూడా వినవలిసినదేనా? రావే రా, ఇక్కడినుండిలేచి పోదాం.

చేటి.—(చేయిపట్టుకొని నిలిపి) భర్తృదారికా, ఆలాగు అనకు, నీవే కల లో అవుపడ్డావు. ఈయనకన్ను మరొకచోట తగులుకోగు

నాయిక.—ఆలా గని సాహృదయానికి నమ్మకం లేదు. గనక కథముగిసేన దాకా విందాం.

నాయ.—వయస్యా, ఆప్రియునే ఈశిలయందు వ్రాసి చిత్రగతతో నేనియు ఆనందమనుభవింపఁ గోరుచున్నాను. ఇదిగో ఈకొండచఱియనుండి మనఃశిలముక్క లను తీసికొని రా.

విదూ.—నీయాజ్ఞ. (పరిక్రమించి తీసికొనివచ్చి) వయస్యా, నీవు ఒక్క రంగే చెప్పినావు, నేను ఇవిగో ఇక్కడనే సులభంగా దొరికిన అయిదురంగులను తెచ్చినాను. ఇక వ్రాయి. [అని ఇచ్చును.

నాయ.—వయస్యా, మంచిపని చేసితివి. (పుచ్చుకొని శిలయందు వ్రాయుచు గగుర్పాటుతో) చెలీ, చూడు —

క. పరిపూర్ణబింబశోభా। ధరముగ గనుపండువు నగుడయిత మొగమై
పరగుతొలిరేఖయున్నది। నెరజాబిల్లిదియుఁ బోలె నించుమ ముదముగ.

[వ్రాయును.

విదూ.—(కుతూహలముతో చూచి) ఆహా అప్రత్యక్షవస్తువుదయినా రూపం ఎంతసరిగా వచ్చింది? ఏమి ఈయాశ్చర్యం!

నాయ.—(చిఱునవ్వుతో) వయస్యా,

క. ఇదిగో, ప్రాణేశ్వరి నా। యెఱుఁగనె దా వెలసియున్న దిచ్ఛాకృతయై
కొద లేక సారెకుం గని। పడిపడి వ్రాసితిని, వింతపడ నేమిటికిన్?

నాయిక.—(కన్నీళ్లతో) చతురికా, తెలిసినదిగదా గథావసానం. ఇక లేచి రా, అన్నయ్యనైనా చూతాం.

చేటి.—(విషాదముతో ఆత్మగతము) ఈ తెగించినమాటవల్ల చూడగా ఈవిడ ప్రాణాలమీద ఆస వదులుకొన్నట్టు ఔపడుతూవుంది. అక్కడికి మనోహరిక వెళ్లింది గదా, ఒకవేళ దొర మిత్రావసువు ఇక్కడికే వచ్చినావచ్చును.

[అంతట మిత్రావసువు ప్రవేశించును.]

మిత్రా.—నాయనగారు ఆజ్ఞాపించినారు —"వత్సా, మిత్రావసూ, జీమూతవాహనుని ఇక్కడనే మనకు సమీపమందున్నందున చక్కఁగా పరీక్షించినారము ఇంతకన్న యోగ్యుఁడైనవరుఁ డెక్కడ నుండును? కనుక ఇతనికి అమ్మాయిని మలయవతిని ఇయ్యవలయును" అని. ఐతే నేను స్నేహపారవశ్యముచేత అనిర్వచనీయమైన దశావిశేషము ననుభవించుచున్నాను. ఏల యనఁగా, —

శా. ఆవిద్యాధరరాజవంశమణి విద్యాంభోధి, సద్వంశ్యుఁడున్
ధీ విక్రాంతి విభూతి రూపఘనుఁడున్, దీప్తాధృతిన్ ప్రాణులన్
గావన్ ప్రాణములైన నీఁగఁడఁగు వేడ్కన్ దాన, యమ్మేటికిన్
రీవిన్ సోదరి నీ మనం బతులతుష్టిం జెందు జాలిం బడున్.

వింటినిగదా జీమూతవాహనుఁడు గౌర్యాశ్రయము చెంగటి చందనలతాగృహము లోనున్నాఁడని. కనుక ఆయీ చందనలతాగృహములోనికి పోయెదను [ప్రవేశించును

విదూ.—(సంభ్రమముతో చూచి) వయస్యుడా, ఈయరిటాకుతో చిత్రకన్యకను కప్పిపెట్టు ఇదుగో సిద్ధయువరాజు మిత్రావసువు ఇక్కడికి వస్తున్నాడు, ఒకవేళ దీన్ని చూచినా చూస్తాడు. [నాయకుఁడు అరఁటియాకుతో మూయును.

మిత్రా.—(ప్రవేశించి) కుమార, మిత్రావసువు నమస్కరించుచున్నాఁడు.

నాయ.—(చూచి) మిత్రావసూ స్వాగతము. ఇక్కడ కూర్చుండుము.

చేటి.—భర్తృదారికా, మిత్రావసువు వచ్చినాడు.

నాయిక.—ఓసే, ఇప్పుడు సంతోషమే నాకు.

నాయ.—మిత్రావసూ, సిద్ధరాజు విశ్వావసువుగారికి కుశలమా?

మిత్రా.—కుశలమే వారియాజ్ఞమీఁదనే నీయొద్దకు వచ్చినాఁడను.

నాయ,—పూజ్యులు ఏమి సెలవిచ్చినారు?

నాయి.—విందాంగాక నాయనగారు ఏమికుశలవార్త పంపినారో.

మిత్రా.—(బాష్పముతో) నాయనగారు నీకుఈవార్త పంపినారు — "నాకు ఈసిద్ధరాజవంశమున కంతటికి ప్రాణమయినది మలయవతియనునొకకూఁతురు గలదు. దానిని నీకు ఇచ్చుచున్నాను; గ్రహింపుము" అని.

చేటి.—(నవ్వి) భర్తృదారికా, ఇప్పుడు కోపగించ వేమి?

నాయిక. —(చిఱునవ్వుతోను లజ్జతోను తల వంచుకొని) ఓసే, నవ్వకు, మరిచిపోయినావా అప్పుడే ఇతనియన్యాసక్తతను?

నాయ.—(అపవారించి) వయస్యా, చిక్కులో పడితిమోయి.

విదూ.—(అపవారించి) ఓహో, నే నెరుగుదును. ఆకన్యయందు తప్ప మరియొకచోట నీమనసు ఆమోదించదు. ఏలాగో ఒకలాగు ఏదో ఒకటి చెప్పి ఇతణ్ణి పంపివేయి

నాయ.—మీతో ఇట్టిశ్లాఘ్యసంబంధమును ఎవరు కోరరు? అయినను ఒకచోట ఆసక్తమైనమనస్సును మఱియొకచోటికి త్రిప్పుట శక్యముగాదు, కనుక నేనీమెను గ్రహింపను. [నాయిక మూర్ఛను నటించును.

చేటి.—నిబ్బరం తెచ్చుకో భర్తృదారికా నిబ్బరం తెచ్చుకో.

విదూ.—అయ్యా, ఈయన పరాధీనుడు. ఈయనను అడిగి ఏమిప్రయోజనం? వెళ్లి ఇతనితల్లిదండ్రులను అడుగు.

మిత్రా.—(ఆత్మగతము) చక్కఁగా చెప్పినాఁడు. ఇతఁడు గురువచనమును జవదాఁటఁడు. ఇతనితండ్రి కూడ ఈగార్యాశ్రమమందే ఉన్నాఁడు; కనుక అక్కడికేపోయి ఆయనచేతనే మలయవతిని గ్రహింపించెదను. [నాయిక సమాశ్వసిల్లును.

మిత్రా.—ఇట్లు తెలియఁబఱుచుకొన్నమమ్ము నిరసించినకుమారునికే విశేషము తెలియును.

నాయిక.—(రోషముతో, నవ్వి,) ఏమీ! నికారముచేత చులకనై పోయిన్ని అన్నయ్య మళ్లీ ఇతనితో మాట్లాడుచున్నాడు? [మిత్రావసువు నిష్క్రమించును.

నాయిక.—(కన్నీళ్లతో, తన్ను చూచుకొనుచు, ఆత్మగతము,) ఇక నాకు దౌర్భాగ్యకళంకితమై అత్యంతదుఃఖభాజనమయిన యీశరీరాన్ని ధరించి ఏమిప్రయోజనం? ఇక్కడనే ఈయశోకవృక్షానికే ఈబండిగురిగింజతీగను ఉరిబోసుకొని ప్రాణం వదలివేస్తాను. (ప్రకాశము, వెడనవ్వుతో,) ఒసే అన్నయ్య వెళ్లినాడో లేదో చూచిరావే, నేను కూడా ఇక్కడనుంచి ఇంటికి వెళ్లిపోతాను.

చేటి.—(కొన్నియడుగులు నడిచి, మరలి చూచి, ఆత్మగతము,) ఈవిడమనసు వేరేవిధంగా వుంది. గనక నేను వెళ్లను. ఇక్కడనే చాటున ఉండి, ఈవిడ ఏమిచేస్తుందో చూస్తాను.

నాయిక.—(దిక్కులు పాఱఁజూచి ఉరితీఁగ చేతఁ బట్టుకొని) భగవతీ గౌరీ, ఈజన్మంలో చేయకపోతివిగాని జన్మాంతరంలోనైనా ఇట్టిదుఃఖభాజనం కాకుండేలాగు చేతువుగాక ఓతల్లీ. [అని ఉరిని మెడకు తగిలించుకొనును.

చేటి.—(చూచి సంభ్రమమున వచ్చి) అయ్యా! రక్షించండయ్యా! రక్షించండయ్యా! ఇదిగో భర్తృదారిక ఉరిబోసుకొంటూఉన్నది!

నాయ.—(తటాలున వచ్చి) ఏదీ? ఏదీ? ఎక్కడ? ఎక్కడ?

చేటి.—ఇదుగో ఈయశోకవృక్షంలో!

నాయ.—(చూచి సంతోషముతో) ఈచెల్వయే ఆదివ్యాంగన నామనోరథభూమి. [నాయికను చేతఁ బట్టుకొని తీఁగను తప్పించును.

మాలి. వలదు! వలదు! చేయఁ బాల, యీసాహసంబుఁ!
దొలఁపుము నవయో నాఁ దోఁచు కెంగేలు వల్లిఁ.
దలిరు నయిన గిల్లఁ దాళదం చెంతు నీకేల్,
వెలఁది యెటులు తీవఁ ద్రేల్చు నుద్బంధనేచ్ఛఁ!

నాయిక.—(భయముతో) ఒసే, ఇతడెవరే? (చూచి రోషముతో చేయిలాగుకొనఁ జూచుచు) వదలు, వదలు నాచెయ్యి. నీవెవరు నివారించడానికి? మరణానికి కూడా నిన్నే ప్రార్థించవలెనా ఏమి?

నాయ,—

క. ఉరి యిడె హారలతాలం । కరణార్హంబైననీదుకంఠంబున నీ
కర; మటు తా నపరాధియ । వరర్ణిని, పట్టినాఁడ వదలునెయిఁకఁ?

విదూ.—కాని, అమ్మా, ఈమెకు ఈయుద్రిప్రయత్నానికి కారణమేమిటి?

చేటి. — ఈయనే మీ ప్రియస్నేహితుడే.

నాయ. —ఏమీ! నేనా ఈసుందరాంగికి మరణకారణము! ఎట్లో ఎఱుఁగఁ జాలను!

విదూ. — అమ్మా, అది ఏలాగో, చెప్పు.

చేటి.—(సాభిప్రాయముగా) ఈస్త్రీ ప్రియస్నేహితుడు అరుగుమీద ఏప్రియను వ్రాసినాడో ఆమెమీద పక్షపాతం కలవాడై, మిత్రావసువు ఇచ్చినా గాని తన్ను అంగీకరించకపోయినాడు గదా, అని ప్రాణాలమీద విసుక్కొని యీవిడ ఈయారంభం చేసింది

నాయ. —(సంతోషముతో ఆత్మగతము) ఓహో ఈతన్వియే విశ్వావసువు గారి కుమారిత మలయవతి! కాక, రత్నాకరమునఁ గాని చంద్రరేఖ మఱియెక్కడ ఉదయించును? ఆహాహా! ఏగా! మోసపోయితిని గదా ఈతరుణిచేత!

విదూ.—అమ్మా, అట్లైతే నాప్రియస్నేహితునిమీద తప్పులేదు. నామాట నమ్మకం లేకపోతే స్వయంగానే వెళ్లి అరుగును చూమకో.

[నాయిక హర్షముతోను లజ్జతోను నాయకుని చూచుచు చేయిలాగుకొనును.

నాయ. —(చిఱునవ్వుతో, శిలయందు వ్రాయబడియున్న నాహృదయవల్లభను చూచువఱకు నీచేయి విడువను. [అందరు పరిక్రమింతురు.

విదూ.— (అరఁటియాకును తీసివేసి) చూడవమ్మా చూడవమ్మా ఈయనగారి ప్రియను.

నాయిక.—(చూచి, అపవారించి, చిఱునవ్వుతో,) చతురికా, నన్నే వ్రాసినట్లున్నది.

చేటి. —(చిత్రాకృతిని చూచి) భర్తృదారికా, ఏమీ! నన్నే వ్రాసినట్లున్నది అంటావు! ఈపోలిక ఎలాగంటిదంటే ఇది రాతిలో తగులుకొన్న నీప్రతిబింబమో కాకపోతే వ్రాసిన నీప్రతిమో తెలియకుండా ఉంది,

నాయిక — (నవ్వి) ఒసే, చిత్రంలో ఉన్ననన్ను నాకు చూపి ఈయన నన్నే చెడ్డదాన్ని చేసినాడు.

విదూ. — నీ కిప్పుడు గాంధర్వవివాహ మయింది! ఇఁక ఈమె చెయ్యి వదులు. ఇటువైపునుంచి ఎవతో వడివడిగా ఇక్కడికే వస్తూ ఉంది,

[నాయకుఁడు వదలును.

[అంతట చేటి ప్రవేశించును]

చేటి.---(హర్షముతో) భర్తృదారికా, ఆహా! నీపుణ్యం! పుచ్చుకొన్నారులే నిన్ను ప్రభువుజీమూతవాహనుని తల్లిదండ్రులు.

విదూ.---(నృత్యము చేయుచు) హీ! హీ! ప్రియవయస్యుని కోరికలు నిండినవి! ఆహా! ఆలాగాదు, మలయవతివి. వీరిద్దరివీగావు [భోజనమభినయించుచు] బ్రాహ్మణ్ణయిన నాఒక్కనివీ.

చేటి.---(నాయిక నుద్దేశించి) నాకు యువరాజు మిత్రావసువుయొక్క ఆజ్ఞ అయియున్నది. ఏమనంటే—"ఈదినమే మలయవతికి పెళ్లి కనక తక్షణం వెళ్లి ఆమెను తీసుకొరా" అని. వెళ్దాంరా.

విదూ.---పోతివిగదవే లంజకూతరా ఈమెను తీసుకొని వయస్యుడుమాత్ర మిక్కడ గుటకలు మింగుతూవుండడ మెందుకు?

చేటి.---చెడిబతికినబాపడా, తొందరపడకు, తొందరపడకు. మీకు కూడా వివాహస్నానవేళ రానే వచ్చిందిలే. [నాయిక అనురాగముతోను లజ్జతోను నాయకుని చూచుచు పరివారముతో నిష్క్రమించును.

[తెరలో వైతాళికుఁడు పాడును.]

స్రగ్ధ. బుక్కావాన స్సురాద్రిస్ఫురణము నిడి యీభూధరేంద్రంబునం దే
చక్కన్సిందూరధూళి న్సలుపుచు రహిఁ దొల్సంజలేయొండశోభ న్
అక్కాంతోద్గతి సంవాద్యరుణమణిరణద్ధంసకస్వానసక్తి న్
దక్క న్నీకు న్వివాహస్నపనక మనుచు న్జాటు సిద్ధాళి గంటే.

విదూ.---(ఆలకించి) వయస్యా. భళిభళీ! స్నపనకం వచ్చింది!

నాయ.---(హర్షముతో) అట్లయిన ఇఁక నిక్కడ నుండ నేల? రా, నాయనగారికి నమస్కరించి స్నానభూమికే పోదము. [అందఱు నిష్క్రమింతురు.

—-:o:—

## తృతీయాంకము.

[అంతట కైపెక్కి సోలుచు చేత సారాయిగిన్నెను పట్టుకొని విటుఁడును, బుజముమీఁది సారాయికుండను మోయుచు చేటుఁడును ప్రవేశింతురు)

విటుఁడు.—

క. కలు దాగు నిత్య మెవఁడో। సలుపును చెలికి చెలువుడికి సంగమ మెవఁడో,
అలయిదరే దేవుళ్లుర । బలదేవు డొకడుర చిత్తభవు డొక్కడురా.

(సోలుచు) శేఖరకుణ్ణయిన నాజన్మం సఫలం గదా.

క. హృదయస్థలాన సైతయు । వదనంలో నల్లగలవవాసనసారా
ముదమొప్ప సిగని శేఖర। పదాన చేటిన్ని యెవనిభాగ్యము యెపుడున్.

(కాళ్లు తడఁబడుచు) అరే! ఎవడు నన్ను కదుపుతాడు? (హర్షముతో) అవశ్యంగా నవమాలిక నన్ను కదుపుతున్నది.

చేటుఁడు.—అయ్యా, ఆ మింకా ఈడకి రానేలేదయ్యా!

విటుఁడు.—(కోపముతో) తొలిజాములోనే మలయవతి పెళ్లి అయిపోయింది. ఎందుచేత ఇది తెల్లవారినా గానీ రాకుండాఉన్నది? (ఆలోచించి, హర్షముతో,) కానీ, అయినా, పెళ్లిసంభరంలో సిద్ధవిద్యాధరు లంతా తమతమప్రియులతోటిన్ని ప్రియురాళ్లతోటిన్ని కూడుకొని కుసుమాకరోద్యానంలో పానోత్సవం అనుభవిస్తూ వున్నారు. అక్కడ్నే నవమాలిక నన్ను ఎదురుచూస్తూ కనిపెట్టుకొని ఉండును. అక్కడికే వెళ్తాను. నవమాలిక లేక ఏమిశేఖరకుడు!

[తడఁబడుచు పరిక్రమించును.

చేటుఁడు—రా అయ్యా, రా, ఇల్లిదుగో కుసుమాకరోద్యానం. లోనికెళ్లవయ్యా. [ఇద్దఱును ప్రవేశమును నటింతురు.

[అంతట బుజముమీఁద దోవవతులచాపు పెట్టుకొని విదూషకుఁడు ప్రవేశించును.)

విదూ,—నాప్రియవయస్యుడి కోరికలు నెరవేరినవి. విన్నానుగదా ప్రియవయస్యుడు కుసుమాకరోద్యానానికి వెళ్లాడని, గనక నేనుకూడా అక్కడికేవెళ్తాను. (పరిక్రమించి చూచి) ఇదే కుసుమాకరోద్యానం. ఇందులోపలికి వెళ్తాను (ప్రవేశించి తుమ్మెదలవలని బాధను నటించుచు) అరేరేరే! ఏమి యీపాడుతుమ్మెదలునన్ను ఇలా బాధించ సాగినాయి! (తనదేహమును ఆఘ్రాణించి) సరి సరి తెలిసింది. ఏమంటే, అల్లుడివయస్యుణ్ణిగదా అని మలయవతిబంధువులు నన్ను గౌరవంగా మైపూ

తలు పూశి చిత్రించినారు, సంతానపుష్పశేఖరం ఒకటి నాజుట్టుకు చుట్టినారు; అల్లి ఆ అతిమర్యాగ అంతా నాకు అనర్థమైనది. అంగు కిప్పుడు ఏంచేతును? పెళ్లికూతు రివారివల్ల దొరికినయీ యౌవనధోవతులచాపుతో ఆడవేషం వేసుకొని ఉత్తరీయం బురఖా వేసుకొని వెళ్తాను చూస్తానుగదా ఈలంజాకొడుకుతు మ్మెదలు ఏంచేస్తాయో.

[అట్లు చేయును.

విటుఁడు.—(చూచి, హర్షముతో) ఒరే, చేటా, (వ్రేలితోనిర్దేశించి, నవ్వుచు) ఇల్లిదిగో నవమాలిక వచ్చిందిరోయి. నన్ను చూసి శానా సేపటికి వచ్చినానని కోప గించుకొని బురఖా వేసుకొని అవతలికి వెళ్తున్నది. గనక దీన్ని మెడపట్టికౌగిలించు కొని బలిమాలుకొంటాను. [తటాలున దగ్గఱకు వచ్చి కంఠము కౌఁగిలించుకొని విదూషకునికి నోట తమ్ములము పెట్టఁబోవును.

విదూ.—(సారాయిగంధమును ఆఘ్రాణించి, ముక్కుపట్టుకొని పెడమొగమై) ఏమి యీగ్రహచారం! ఆమధుపాలనుంచి తప్పించుకొన్నా ఇప్పుడు ఈమధుపుడి మొఖంలో పడిపోయినాను!

విటుఁడు.—ఏమిటి! కోపంచేత మొఘం తిప్పుచున్నది! (సాగిలఁబడి మ్రొక్కుచు విదూషకునిపాదములు నెత్తిమీఁద పెట్టుకొని) మన్నించు, నవమాలికా, మన్నించు.

[అంతట చేటి ప్రవేశించును.]

చేటి.—భర్తృదారిక ఆజ్ఞాపించింది.—"ఒసే, నవమాలికా, కుసుమాకరో ద్యానానికి వెళ్లి ఉద్యానపాలికపల్లవికతో ఇప్పుడే చక్కగా తమాలవీధిని అలంకారం చెయ్యమని చెప్పవే" అని. నేనున్ను పల్లవికతో చెప్పివేశినాను. ఇంకను రాత్రియెడబాపుచేత మరీ మరీ గుటకలుమింగుతూవుండే నానేస్తం శేఖరకుణ్ణి వెతుకుతాను. (చూచి) ఇదుగో శేఖరకుడు. (రోషముతో) ఏమిటీ! ఎవతెనో ఒకదాన్ని బతిమాలుకొంటున్నాడు! కానీ ఇక్కణ్ణే ఉండి ఇదెవతో తెలుసుకొంటాను.

విటుఁడు.—(హర్షముతో)

క. హరిహరపితామహులకే। గరువం తల కెక్క మొక్కగా నేరని శే
ఖరకుడు నవమాలిక నీ। చరణాల్లో రాలె యిదుగో క్షమియించగదే.

విదూ.—లంజకొడకా, తాగుబోతా, నవమాలి కేదిరా ఇక్కడ?

చేటి.—(చూచి, చిఱునవ్వుతో,) ఏమిటీ! నన్నునుకొని కైపుచేత ఒళ్లెరక్క శేఖరకుడు అయ్యను ఆత్రయ్యను బతిమాలుకొంటున్నాడు. కానీ, అబద్ధపు కోపం తెచ్చుకొని ఇద్దరినీ వేళాకోళం చేస్తాను.

చేటుఁడు.—(చేటిని చూచి శేఖరకుని చేతితో కదపుచు) అయ్యా, ఈవిణ్ణి వదిలెయ్యి, ఈవిడ నొవమాళిగమ్మ గాదు. ఇల్లిదుగో నొవమాళిగమ్మ రోసంతో కళ్లెఱ్ఱ జేసుకొని వొస్తావుంది.

చేటి.—(వచ్చి,) శేఖరకా, ఎవతిని బతిమాలుకొంటున్నావు?

విదూ.—(ముసుఁగు తీసి) అమ్మో, నేను బ్రాంహ్మణ్ణి, దౌర్భాగ్యుణ్ణి.

విటుఁడు.—(విదూషకుని చూచి) ఒరే నల్లకోతీ, నీవు కూడా శేఖరకుణ్ణి మోసంచేస్తావట్రా! ఓరే చేటా. వీణ్ణి పట్టుకోరా, ఇదుగో నవమాలికను బతిమాలుకొని వచ్చిందాకా.

చేటుఁడు.—అయ్యగారి శిత్తం.

విటుఁడు —(విదూషకుని వదలి చేటిపాదములమీఁద పడి) నామీద కనికరించవే, నవమాలికా, కనికరించదే.

విదూ.—(ఆత్మగతము) ఇదే నాకు పారిపోవడానికి మంచిసమయం.

[పాఱిపోఁజూచును.

చేటుఁడు.—(విదూషకునిజందెము పట్టుకొనును, అది పుటుక్కున తెగును.) ఎలాగా! ఎలాగా! నల్లకోతీ? పారిపోతావుగా!

[అని అతనియుత్తరీయమునే అతని మెడకు కట్టి లాగును.

విదూ.—అమ్మో, నవమాలిగా, కరుణించు, నన్ను విడిపించు.

చేటి.—(నవ్వి) భూమిమీద తల పెట్టితే నాపాదాలమీద పడతే.

విదూ.—(రోషముతోను, కంపముతోను,) ఏమిటీ! గంధర్వరాజుస్నేహితుణ్ణి బ్రాంహ్మణ్ణి, లంజకూతురా, నీకాళ్లమీద పడతానూ?

చేటి.—(వ్రేలితో బెదరించుచు చిఱునవ్వుతో) ఇదుగో, ఇప్పుడే నిన్ను పడేలాగ చేస్తాను చూచుకో. శేఖరగా, నిన్ను మన్నించినాను లే, (కంఠము కౌఁగిలించుకొనుచు) ఈయనగారు అల్లుడుగారి ప్రియస్నేహితుడు, ఈయన్ని నీవు నానాతంటాలు పెట్టినావు. ఒకవేళ ఈమాట తెలిస్తే దొర మిత్రావసువు నీమీద కోపం చేసును. అందుచేత ఈయన్ని ఆదరంతోటి మర్యాదచెయ్యి.

విటుఁడు.—నవమాలికచిత్తం. (విదూషకునికంఠము కౌఁగిలించుకొని) అయ్యా, నీవు సంబంధికుడవుగదా అని వేళాకోళం చేసినాను. (సోలుచు) నిజమేనా? శేఖరకుడు ఎంతపరిహాసం చేసినాడూ! (ఉత్తరీయమును చుట్టచుట్టి ఆసనముగా పెట్టి) ఇక్కడ కూర్చోవయ్యా సంబంధికా, ఇక్కడ కూర్చో.

విదూ.—(తనలో) భళీ, వీడికై పు దిగినట్టుంది. [కూర్చుండును.

విటుఁడు.—నవమాలికా, ఈయనపక్కను ఈయన్నంటుకొని నూవుకూడా కూర్చో, మిమ్మలిని ఇద్దరినీకూడా ఒకమాటేసమ్మానిస్తా. [చేటి నవ్వి కూర్చుండును.

విటుఁడు.—(గిన్నెపట్టుకొని) చేటా, దీన్నిండా సారా పొయ్యరా.

[చేటుఁడు నాట్యముతో గిన్నెను నిండించును.

విటుఁడు—(తనసిగనుండి పువ్వులుతీసి గిన్నెలోవేసి మోఁకాళ్లమీఁద నిలిచి నవమాలికకు ఇచ్చుచు) నవమాలికా, దీన్ని రుచిమాచి అయ్యవారికి ఇయ్యవే.

చేటి.—(చిరునవ్వుతో) శేఖరకుడి చిత్తం. [అట్లేచేసి విటునికి ఇచ్చును.

విటుఁడు.—(విదూషకునికి గిన్నెను ఇచ్చుచు) ఇది నవమాలిక నోటియెంగిలిచేత ఘుమఘుమాయమానంగా వాసనకొడుతూఉండే రుచిగలది, శేఖరకుడికన్నా మరియెవరన్నూ ఇంతకుముందు ఆస్వాదించనిది, దీన్నితాగవయ్యా. నీకు ఇంతకన్నా సమ్మానం నేనేమి చేయుగలను?

విదూ. —(వెడవెడ నవ్వి) శేఖరకా, ఒరే, బ్రాహ్మణ్ణిరా.

విటుఁడు.—బ్రాంహడవైతే నీ జందెమేది?

విదూ.—అది చేటుడు పట్టుకొని లాగేటప్పటికి తెగిపోయిందిరా.

చేటి.—ఆలాగయితే, వేదాక్షరాలయినా కొన్ని చెప్పు.

విదూ.—ఏమే అమ్మీ, నన్నుమీరు ఈలాగు తంటాలుపెడుతున్నారు? ఈ సారాయికంపెక్కడ వేదాక్షరాలెక్కడ? కానీ, నీతో వాదంనాకెందుకు? ఇదుగో బ్రాహ్మణ్ణి నీపాదాలమీద పడుతున్నాను. [అని చేటిపాదములలో పడఁబోవును.

చేటి.—(చేతులతో నివారించి)వొద్దయ్యా, వొద్దయ్యా, ఆలా చెయ్యకయ్యా నీ పుణ్యం! శేఖరకా, అవతలికివెళ్లు, బ్రాంహడుగదా యీాయన. (విదూషకునిపాదములఁ వ్రాలి) స్వామీ, మీరు కోపంచెయ్యకండి, సంబంధికుడివి గనుక యీాలాగ పరిహాసం చేసినాను.

విటుఁడు.—నేనుకూడా ఈయన్ని బతిమాలుకొంటా. (విదూషకుని పాదములలోపడి) స్వామీ, మన్నించండి మన్నించండి నేను కైపుచేత చేసిన నేరాన్ని. నేను నవమాలికతో కూడా కల్లుసారాయిబువ్వానికి వెళ్లిపోతాను.

విదూ. —క్షమించాను. మీరిద్దరూ పొండి. నేనున్ను వెళ్తాను. నాప్రియవయస్యుణ్ణి చూడడానికి. [చేటితో విటుఁడును, చేటుఁడును, నిష్క్రమింతురు.

విదూ.—తప్పిపోయిందిరా బ్రాహ్మడికి అపమృత్యువు! ఈ తాగుబోతు సంపర్కంచేత మైలపడ్డాను. ఈదిగుడుబావిలో స్నానంచేస్తాను. (అట్లుచేసి తెరవైపు చూచి) ఇదుగో నాప్రియవయస్యుడు రుక్మిణిని హరిలాగు మలయవతిని తోడ్కొని వస్తున్నాడు. సరి, ఇతని పార్శ్వవర్తి నౌతాను.

[అంతట పెండ్లివేషముతో నాయకుఁడును, మలయవతియు,
విభవముగా పరివారమును ప్రవేశింతురు.]

నాయ.—(మలయవతిని చూచుచు, హర్షముతో),

ఉ. ఏను దనుం గనం గను మహీన్, బదు లాడను పల్కరించినన్,
బానుపుపైఁ బరాఙ్ముఖతఁ బండు, వడంకుఁ గవుంగిలించినన్,
పానుపుటింటినుండి చెలువ ల్వనఁ దానుఁ జనంగడ గు, నె
వ్లైనియు నాకు వామత నె యింపులుగుల్కె నవోఢ యెంతయున్.

(మలయవతిని చూచుచు) ప్రాణేశ్వరీ, మలయవతీ,

శా. మానంజాలనిదీక్ష నూఁకొనుటయే మార్వల్కుగా మానినై,
భానూష్మాతిగచంద్రికాభిధమహా పంచాగ్నితప్తాంగనై
ధ్యానం బొప్పఁగ నేకతానముగ నిత్యం బేతపం బొందితిన్,
దానం గంటి వరంబు నీవదనమున్ దర్శింపఁ బ్రాణేశ్వరీ.

నాయిక.—(అపవారించి) ఒసే, చతురికా, అందగాడుమాత్రమే గాక ప్రియములాడడానికికూడా నేర్చియున్నాడే

చేటి.—(నవ్వి) ఏమిపక్షపాతమమ్మా! నిజముచెప్పితే అందులో ప్రియమేమున్నది?

నాయ.—చతురికా, కుసుమాకరోద్యానమునకు దారి చూపు.

చేటి.—రండి ప్రభూ రండి.

నాయ.—(పరిక్రమించి నాయికను నిర్దేశించి) మెల్లఁగా, మెల్లఁగా రా.

శా; గాసిం బెట్టు నురోజభార మిదె లేఁగౌఁదిఁగఁ, బైహార మే
లా? సోలించు నితంబమూరువుల, నేలా కాంచి యొం డాపయిన్?
దాసైరంపద యూరుయుగ్మమును బాదద్వంద్వ. మేలందియల్?
కై సేఁతల్ చెలి నీకు నంగములె, దేలా మోచె దీభూషలన్?

చేటి.—ఇదే కుసుమాకరోద్యానం. ఏలినవారు ప్రవేశింతురుగాక.

[అందఱు ప్రవేశింతురు,

నాయ.—(చూచి) ఓహోహో! కుసుమాకరోద్యానము యొక్క ఉత్కృష్ట లక్ష్మి! ఇక్కడ,

స్రగ్ధ. క్షీరప్రస్యందనాళీశిశిరితతలముల్ శ్రీలతామండపంబుల్;
ధారాగేహంపుఁగారధ్వని కనుగుణతం దాండవం బాడుఁ గేకుల్;
వారివ్యూహంబు యంత్రోత్పతిత మయి పతత్పుష్పధూళీవృతంబై
పూరించుక్షుద్రకుల్యల్ పొరల రయమున న్భూరుహావాలపంక్తిన్.

మఱియు,

మ. కలగీతంబులు తీవమాడు(?)కలు క్రమ్మఁగం బాడుచు, బుష్పధూ
ళులఁ బిష్టాతకవిభ్రమం బొనర తోలు న్గండుఁ గాఁ గూడి, యే
వలనం జూచినఁ దామరై మధువు ం బర్యాప్తమైఁ గ్రోలుచున్,
జెలియా, పానమహంబు నీమధుపముల్ సేవించుచుండన్ బలెన్.

విదూ.—(వచ్చి) జయం జయం వయస్యునికి. స్వస్తి వెళ్ళొస్తామాస్తును.

నాయ.——వయస్య, చాలసేపటికి అగపడితివా వోయి.

విదూ.—వయస్యా, నేను త్వరగానే బైలుదేరినాను. అయినా. వివాహ మహోత్సవంలో కూడిన సిద్ధవిద్యాధరుల పానోత్సవాన్ని చూస్తూ ఇంత ఆలశ్యం అయినది. నీవుకూడా చూడు.

నాయ.—ఆలాగే, నీవు చెప్పినట్లు. (అంతటను కలయఁజూచుచు) వయస్యా,

మ. కలయం గంద మలంది, తాలిచి మెయిన్ గల్పప్రసూనకల్పకుల్,
వెలిపుట్టంబులు భూషణాబ్జమణిరుగ్విచ్ఛిత్తిఁ గొంపారఁగాఁ,
గలపై, చందనవీథులన్ సురఁ బ్రియాగంధదూష శేషంబుఁ జే
రెలమిన్ సిద్ధులఁ గూడి త్రావుదురు వీరే కంటె విద్యాధరుల్.

కనుక, రా, మనముకూడ అలిమాలవీథికే పోదము [పరిక్రమింతురు.

విదూ.—ఇదుగో తమాలవీథి. ఈపాటి యిక్కడి తిప్పటకే వెళ్ళొస్తామాస్తు చాలా అలిసిపోయినట్టున్నది. గనక ఇక్కణ్ణే ఈ స్ఫటికశిలమీద కూర్చుండి విశ్రమింతాము.

నాయ.—వయస్యా, చక్కఁగానే గ్రహించితివి.

క. వ్యాపించు గండకాంతులఁ। జీ పామ్మని శశిని ద్రోచి, చెలియమొగము వే
తాపానురక్తమై, యిపు। డేపునఁ గమలంబుఁ గెలువ నిచ్ఛ వహించెన్.

(నాయికచేతిని పట్టుకొని) ప్రియా, ఇక్కడ కూర్చుండుము.

నాయిక.—ఆర్యపుత్రుని చిత్తం. [అందఱు కూర్చుందురు

నాయ.—(నాయికముఖము నెత్తిచూచుచు) ప్రియా, మేము నిన్ను కుసుమాకరోద్యానదర్శన కుతూహలము చేత వృథాగా ఆయాసపెట్టితిమి. ఏలయనఁగా

క. మానుగ సుభ్రూలత పై। భానవదరుణాధరోష్ఠ పల్లవముగనీ
యానన మె నందనమును। ద్యానము నగు; లాఁతి కేవలారణ్య మగుట.

చేటి.—(చిఱునవ్వుతో విదూషకుని నిర్దేశించి) విన్నావటయ్యా భర్తృదారికను ఏలాగ వర్ణిస్తున్నాడో? నేను నిన్ను వర్ణిస్తాను చూడు.

విదూ.—(హర్షముతో) అమ్మో, బ్రతికినాను. నీవు ఏలాగవర్ణిస్తే, ఇతడు నన్ను మళ్లీ నీ వెటువంటివాడవో కొండముచ్చుయొక్క ఆకారమున్న అటువంటిదే అని అనడో, ఆలాగ వర్ణింతువని వేడుకొంటాను.

చేటి.—స్వామీ, నీవు పెళ్లి జాగారంలో నిద్రచేత కళ్లు మూసుకొని కునికిపాట్లు పడతూ నాకు చాలా అందంగా అవుపడ్డావు. గనక ఇప్పుడు మళ్లీ ఆలాగే కూర్చో వర్ణిస్తాను. [విదూషకుఁడు అట్లు చేయును

చేటి.—(ఆత్మగతము) ఇతగాడు కళ్లు తెరవకమునుపే సిరావన్నెగల యీ చీకటిచిగుళ్ల పసరుతో ఇతడిముఖానికి నల్లరంగు వేస్తాను.

[లేచి చీఁకటిచిగుళ్లను పిడిచి విదూషకునిముఖమూనకు నలుపు వేయును.
నాయకుఁడును నాయికయు విదూషకుని చూచుచుందురు.

నాయ.—వయస్యా, ధన్యుఁడవోయి నీవు. మేమిద్దఱ మేయుండఁగా నీ విట్లు వర్ణింపఁబడుచున్నావు. [నాయిక నాయకునిముఖము చూచి చిఱునవ్వు నవ్వును.

నాయ.—(నాయికముఖము చూచి)

తే. మగువ, యీస్మిత ప్రష్పోద్గమంబు నీదు
నధరపల్లవపుటముపై నవతరించె;
ఫలము మాత్రము వేఱొండుపజ్జ దానిఁ
బాయకయ గాంచు నాకన్నుదోయిఁ బోడమె.

విదూ.—ఏం చేశావే నీవు?

చేటి.—వర్ణించినానయ్యా

విదూ.—(చేతితో ముఖము తుడిచి చూచుకొని కోపముతో చేతికఱ్ఱయెత్తి) ఆ! లంజకూతురా! దివాణంసుమా యిది. చూడు నీకేం చేయిస్తానో. (నాయకుని

నిర్దేశించి మీయెట్టయెదటనే నన్ను ఈ లంజకూతురు ఈలాగ అవమానించింది గదా. ఇక నిక్కడనుండి నాకేమి ప్రయోజనం? నేనెక్కడికైనా లేచిపోతాను.

[నిష్క్రమించును.

చేటి —స్వామి ఆత్రేయ్య నామీద రోపగించినాడు, నేను వెళ్లి ఆయన్ని బతిమాలుకొంటాను

నాయిక. —చతురికా, ఏమే నన్ను ఒంటరిగా వదిలిపెట్టిపోతావు?

చేటి. —(నాయకుని నిర్దేశించి) ఈలాగే కలకాలం వొంటరిగావుండు.

[అని నిష్క్రమించును.

నాయ.—నాయికముఖమునుచూచుచు)

ఆ. సూర్యకిరణములకు జొత్తిల్లియున్నది, । రదనకిరణకేసరములు గలవు,
తరుణి, నీ మొగంబు తామరసమయేని, । మధుపుఁ గ్రోలవలదెమధుపమందు?

[నాయిక నవ్వి ముఖమును అవలికిత్రిప్పును.
నాయకుఁడు మఱల ఆదేచదువును.

చేటి. —(అపటీక్షేపముగా ప్రవేశించి సమీపించి) ఇదుగో ప్రభువు మిత్రావసువు ఏదో పనిగూఁద కుమారుని చూడడానికి వస్తున్నాడు.

నాయ. —ప్రాణేశ్వరీ, ఏవు ఇంటికిపొమ్ము. నేను మిత్రావసువును చూచి త్వరగా వచ్చినవాఁడనే. [నాయిక చేటితోఁగూడ నిష్క్రమించును.

[అంతట మిత్రావసువు ప్రవేశించును.]

మిత్రా.—

క. ఆకంటకుఁ బరిమార్పక । యేకరణిం బావమఱఁది యెదుటికిఁ జని నే
వాక్రుత్తును 'ఏ రాజ్యము । నాక్రమణము చేసె శత్రుఁ డ'నుచు నలజ్జన్?

చెప్పకపోవుట యుక్తము గాదు, కనుక చెప్పిపోయెదను. (సమీపించి) కుమారా, మిత్రావసువు నమస్కరించుచున్నాఁడు.

నాయ. —(మిత్రావసువును చూచి) మిత్రావసూ, ఇక్కడ కూర్చుండు.

[మిత్రావసువు కూర్చుండును.

నాయ. —(చూచి) మిత్రావసూ, ఏమిసంరంభముతో అగపడుచున్నావు?

మిత్రా. —మతంగహతకునివిషయమై సంరంభమనగాఁ ఎటువంటిది?

నాయ —మతంగుఁ డేమి చేసినాఁడు?

మిత్రా. —తననాశముకొఱకే నీరాజ్యము నాక్రమించినాఁడు.

నాయ.—(హర్షముతో ఆత్మగతము) అట్టియిన మంచిదే; ఇది సత్యమగునా.

మిత్రా.—వానిని వెడలార్చుటకు కుమారుఁడు అజ్ఞయియ్యఁదగును వేయేల?

స్రగ్ధ. రుద్ధబ్రధ్నప్రసరా వర్షకదినమలిక్ప్రోదసీశ్యామతా సం
బద్ధ ద్యోయానఘట్టామహీమకృతిహరిన్మధ్యమానాంబరం బై
సిద్ధానీకంబు సంప్రస్థిత మిదిగో భవచ్ఛిష్టి యుద్ధాదృతేష్టిన్,
సిద్ధం బిద్ధారినాశాచిరదరకరదస్ఫీతరాజ్యంబు నీకున్.

పోనీ, సైన్యము లేల?

మదనము. ఏకాకి నై, యెఱుఁగు మీ, విడి పోయి నేఁ గో
శాకృష్ట ఖడ్గ ఘృణిసంహతికేసరాప్తిన్
ఆఁకొన్న సింహము హళాహళి హస్తిఁ బోలెన్
ఢాకన్ మతంగహతకున్ ధరఁ గూల్చినాఁడన్.

నాయ.—(చెవులుమూసికొని, ఆత్మగతము,) హా! ఏమి క్రూరమయినమాట! కానీ ఇట్లు చెప్పెదను. (ప్రకాశము) మిత్రావసూ, ఇది ఏపాటి? బాహుశాలివైన నీకు అసాధ్య మేమున్నది? అయినను,

క. ప్రాణము నయినఁ బరులకై। తా నొసఁగుదు నఁట యయాచితంబుగఁ గృప, నా
నే నే రాజ్యముకై యెటు। ప్రాణివధారంభమునకుఁ బనిచెద నొరులన్?

మఱియు, క్లేశములమీఁద తప్ప నాకుఁ మఱి దేనిమీఁదను శత్రుబుద్ధిలేదు. నీవే గనుక నాకు ప్రియముచేయఁగోరెదవేని, రాజ్యలోభిన్యై క్లేశములచే దనీకృతుఁడైన యాదీనునియందు కనికరింపుము.

మిత్రా.—(కోపముతో) ఏమీ! మనకు ఇట్టియుపకారియు దీనుఁడు నగు వీఁడు కనికరమునకు ఎట్లు పాత్రము కాకపోవును?

నాయ.—(ఆత్మగతము) ఇతని సంరంభము నివారింప శక్యము గాకయున్నది. కోపావిష్టచిత్తుడైన యితనిని మఱలింప శక్యముగాదు. ఇట్లు చెప్పెదనుగాక (ప్రకాశము) మిత్రావసూ, లే, లోపలికిపోదము. అక్కడనే నీకు బోధించెదను. ఇప్పుడు ప్రొద్దుగ్రుంకుచున్నది. అట్లే గదా.

మ స్ర. ప్రకటాస్తిస్వాపకుబ్రాహ్వవకలితమహాపద్మకోశుండు సంస్థా
వికలాశాపూరకైక ప్రియనిజకరసంప్రీణితాశే విష్వం
డకలంకానందసిద్ధాశ్యభినుతిపదమై యస్తముం బొందువాఁ డీ [ల్లున్.
యొకఁడే మిత్రుండు కీర్త్యం డొరుకొలకె యి టన్యుండెవం డుద్భవి

[అందఱును నిష్క్రమింతురు.

# చతుర్థాంకము.

---

[అంతట రక్తవస్త్రయుగ్మము చేతఁ బట్టుకొని కంచుకియు, ప్రతీహారియు, ప్రవేశింతురు.]

కంచుకి.—

తే. భవ్యత నొనర్తు నంతఃపురవ్యవస్థఁ
గనదుఁ బ్రతిపదమునను సంకలితములను,
దప్పకయ దండనీతిని దాల్చి నడతు,
మొనసె నృపవృత్త మెల్లను ముదిమి నాకు.

ప్రతీ. – అయ్యా వసుభద్రా, నీ వెక్కడి కయ్యా బయలుదేఱితివి?

కంచుకి.—దేవి మిత్రావసుతల్లి ఆజ్ఞాపించిరి ‘‘కంచుకీ, పది దినముల’ దాఁక నీవు మలయవతికిని అల్లునికిని ఎఱ్ఱవస్త్రములు తీసికొనిపోవుచుండవలయును’ అని. అమ్మాయి అత్తవారియింట నున్నది. నీజీమూతవాహనుఁడు యువరాజుతోకూడ సముద్రపుబోటును చూడఁబోయినాఁడని వింటిని కనుక ఇప్పుడు ఏమి చేయుదును, రాజపుత్త్రియొద్దకు పోదునా, లేక అల్లునియొద్దకు పోదునా?

ప్రతీ. –అయ్యా, రాజపుత్త్రియొద్దకు పోవుటయే మంచిది. అక్కడికి ఒకవేళ ఇప్పుడు అల్లుఁడు స్వంతముగానే వచ్చినను వచ్చును.

కంచుకి. —చక్కఁగా చెప్పితి వయ్యా, సరే, మఱి, నీ వెక్కడికి బయలు దేఱితివి?

ప్రతీ.—మహారాజవిశ్వావసువుగారు నన్ను ఆజ్ఞాపించినారు, ఏమనఁగా.— ‘‘సునందా, పోయి మిత్రావసువుతో చెప్పు —‘ఈదీపప్రతిపదుత్సవమందు మలయవతికిని అల్లునికిని ఏమయిన ఇయ్యవలయునుగదా, అని ఉత్సవమునకు తగినట్లు కొంచెము వచ్చి ఆలోచింపు’మని.

[అంతట జీమూతవాహనుఁడు మిత్రావసువును ప్రవేశింతురు.]

నాయ.—

ఉ. పానుపు శాద్వలంబు, కలుబల్ల లరంగులు, గేహము ల్ద్రుమాల్,
పానకము నిర్ఝరోదకము, భక్ష్యము కందము, లేళ్లు చెలుల్
మానుగ నిట్లయత్నసుఖ మండి తపోవని గోష మే మనన్,
బ్రాణి కటా! పరార్థవిరహార్తికదర్థిత మర్థిహీనతన్.

మిత్రా. —(ఊర్ధ్వము చూచి) కుమార, త్వరగా రా, త్వరగా రా, ఇదే సముద్రపుఁబోటు వేళ.

నాయ.—(ఆలకించి) చక్కఁగా తెలిసికొంటిని.

చ. జలకరు లూర్మిపై కెగసి చయ్యన మున్గగభిల్లుభిల్లొదల్
దలపడఁ, గందరాస్యఘటిత ప్రతిఘోష లతిస్ఫుటంబులై
మలఁగఁ, జెవుల్ చెవుడ్పడఁ గ్రమంబుగ రేఁగెడునీరొదన్గనన్,
లలదతిసంఖ్యశంఖధవళం బడె పోటురుదెంచెఁ బోవడిన్.

మిత్రా.—ఇదిగోరా నే వచ్చినది, చూడుు.

క. కవళించి లవంగపులేఁ ॥ జిరువుఁ గరిముకరులు ద్రేపఁ జిక్క వలుచునం
బువులు చెలువార రత్న । చ్ఛవితో నిదె కడలివేల చాల వెలుంగున్

నాయ.—మిత్రవసూ, చూడుచూడు, శరత్కాలమేఘంపుగుంపులచేత ఆవరింపఁబడినవై యీమలయసానువులు హిమాలయ శిఖరములయొప్పును విడంబించు చున్నవి.

మిత్రా.—ఓహో! ఇవి మలయసానువులు గావు, పాములయొక్కయస్థిరాసులు సుమా ఇవి.

నాయ.—(ఉద్వేగముతో) కటకటా! ఇవి యేల యిట్లు సంఘాతమరణమును పొందినవి?

మిత్రా.—కుమార, ఇవి సంఘాతమృత్యువులు గావు. ఇక్కడ పూర్వము గరుత్మంతుఁడు ప్రతిదినము తన రెక్కలగాలిచె సముద్రముయొక్క జలమంతయు ఎగురఁగొట్టి పాతాళమునుండి తన్నుకొని వచ్చి ఒక్కొక్కనాగమును ఆరగించుచుండెను.

నాయ.—(ఉద్వేగముతో) అయ్యో! ఎంతక్రూరకృత్యము చేయుచుండెను! అటుపైన, అటుపైన.

మిత్రా.—అటుపైన సకలనాగవినాశభీతుఁడై వాసుకి గరుత్మంతునితో నిట్లు మనవిచేసికొనెను.

నాయ.—(ఆదరముతో) ఏమని? తన్ను మొదట భక్షింపు మని యా?

మిత్రా.—కాదు కాదు.

నాయ.—మరేమని?

మిత్రా.—ఇట్లు చెప్పుకొన్నాఁడు.—"నీవు వచ్చి పడుగు పడుదగలుచేత నీనవేలుగా నాగాంగనలగర్భములు స్రవించిపోవుచున్నవి అందువలన మాకు వంశనాశము, నీకును స్వార్థహాని కనుక ఎందునిమిత్తము నీవు నాగలోకమునకు దిగుదువో ఆనాగమును దినమున కొక్కటి నేను నీకు పంపెదను" అని.

నాయ. — ఆహా ఎంతచక్కఁగా రక్షించినాఁడయ్యా నాగలను నాగరాజు?

తే. నాలుకలు రెండు గాలు నొకరెండువేలు, వాని
లోన లేదాయె నే యొక్కఁడే నతనికి,
నో గరుఁడ, యారగించిన న్నొక్క పాముఁ
గావవే నేఁటి కనుచు వాపోవునాల్క!

మిత్రా. — అందులకు పక్షిరాజు అంగీకరించినాఁడు.

తే. శేఖుఁ డిటు వేఁడ, గరుడుండు చిత్తమిచ్చి
గిన మొకటిగాఁగఁ బాములఁ దినఁగ, వాని
యస్థికూటంబు లవియె హిమాద్రు లనఁగఁ
బొదలెఁ బొదలుచునున్నవి పొదలు నింక.

నాయ. — ఆశ్చర్యము!

క. ఆపన్నిధాన మగుచు । ప్రాపకను కృతిఘ్న మస్థిరముపాయము నా
నీపాడుకాయమునకై । పాపములం జేసికొం్రదు పామరు లకటా!

అయ్యో! నాగులయీయాపదకు కష్టమే పర్యవసానమైనది! (స్వగతము) నాదేహం
మర్పించి ఒకనాగముప్రాణమేని రక్షింప నావలన నగునేని బాగుగానుండును.

[అంతట ప్రతీహారుఁడు ప్రవేశించును.]

ప్రతీ — కొండశిఖరము నెక్కితిని ఇఁక మిత్రావసువును వెదకెను. (పరిక్రమించి) వీఁడుగో మిత్రావసువు, అల్లునిచెంత నున్నాఁడు. (సమీపించి) జయము జయము కుమారులకు.

మిత్రా. — సునందా, యేమిపనిగాఁ వచ్చితివి ఇక్కడికి?

[ప్రతీహారి చెవిలో చెప్పును.

మిత్రా. — కుమార, నాయనగారు నన్ను పిలుచుచున్నారు.

నాయ. — మంచిది పొమ్ము

మిత్రా. — కుమారుఁ డైనను బహ్వపాయమైన యీప్రదేశమందు చాలసేపు ఉండఁగూడదు. [అని నిష్క్రమించును.

నాయ. — నేనును ఈకొండశిఖరమునుండి దిగి చెలియలికట్టను పోయిచూచెదను. [పరిక్రమించును.

(తెరలో)

అయ్యో పుత్రా! శంఖచూడా! అయ్యో! నిన్ను చంపులూ ఉండఁగా గదరా నేను ఇప్పుడు చూడవలసివచ్చినది!

నాయ.—(ఆలకించి) ఓహో! స్త్రీయొక్క విలాపమువలె వినఁబడుచున్నది! ఈమె ఎవరు? ఈమెకు ఎందుకై భయమో కనుంగొనియెద. [పరిక్రమించును.

[అంతట యేడ్చుచున్న ముసలిది వెంట వచ్చుచుండఁగా శంఖచూడుఁడును, గుడ్డలోపల రెండు ఎఱ్ఱవస్త్రములు పెట్టుకొని కింకరుఁడును ప్రవేశింతురు.]

వృద్ధ.—(కన్నీళ్లతో) హా! పుత్రా! శంఖచూడా ఇప్పుడు నిన్ను చంపుతూ ఉండగా గదరా నేను చూడవలిసివచ్చినది! (గడ్డముపట్టుకొని) ఈ ముఖచంద్రుడు లేనిది ఇకను పాతాళలోకం అంధకారమై పోతుందిరా.

శంఖ.—అమ్మా, ఏల యీదిగులు? నన్ను మిక్కిలి పీడించుచున్నావు.

వృద్ధ—(చూచి, కొడుకుయొక్క అవయవములను తడవుచు) అయ్యో పుత్రా, ఎండపొడయెరగని నీసుకుమారశరీరాన్ని కనికరంలేక గరుత్మంతుడు ఏలాగ ఆరగిస్తాడురా? [కంఠము కౌఁగిలించుకొని ఏడ్చును.

శంఖ—అమ్మా ఏడువకు యేడువకు, చూడు,

ఆ. నిత్యమెత్తుకొను ననిత్యత తొలి, దాన। జననియో యనంగ జాతమాత్రుఁ;
విడపఁ దల్లి దాదివిధమునఁ గైకొనుఁ; । గతము గలుగు యింకు మృతికివగవ?

[పోఁబోవును.

వృద్ధ.- నాయనా, క్షణ ముండరా నీముఖం చూస్తాన.

కింకరుఁడు —రావయ్యా అబ్బాయీ శంఖచూడయ్యా, కన్నకడుపు గనక మాతురాలు గదా ఈమె, రాచకార్యమును ఎరగగు.

శంఖ.— ఇదిగో వచ్చితిని.

కింకరుఁడు.—(ఎదుటచూచి ఆత్మగతము, ఈయనగారిని వధ్యశిలకాడికి తీసుకొనివచ్చినాను. ఇక వధ్యచిహ్నాన్ని ఇస్తాను.

నాయ. - ఈమె ఆ స్త్రీ. (శంఖచూడుని చూచి) నిశ్చయముగా ఇతఁడు ఈమెకుమారుఁడు గావలయును. ఏల యేడ్చుచున్నది? (అంతటను కలయఁజూచి) ఈమెభయకారణము కొంచెమయినను తెలియఁబడదు ఈమెకు ఎందువలన భయము? సమీపించెదను. వీరికి సంభాషణ జరుగుచునే యున్నది. ఒకవేళ దానివలననే ఈ విషయము స్పష్టపడును. కనుక చెట్టుచాటునుండి వినియెదను గాక.

కింకరుఁడు.—(చేతులు మోడ్చుకొని కన్నీళ్లతో) అబ్బాయీ శంఖచూడయ్యా, రాజాజ్ఞచేత ఈపాడుమాట నానోట చెప్పవలసియున్నది.

శంఖ.—భద్రా, చెప్పుము.

కింకరుఁడు.—నాగరాజు వాసుకి ఆజ్ఞాపిస్తున్నాడు.

శంఖ.—(శిరమున అంజలి చేర్చి ఆదరముతో) ఏలినవారు ఏమి యాజ్ఞాపించినారు?

కింకరుఁడు.—“ఈయెఱ్ఱబట్టలను రెంటిని కట్టుకొని వధ్యశిల యెక్కి, ఎఱ్ఱబట్ట ఆనవాలుచేత గరుడయ్య నిన్ను ఆరగిస్తాడు,” అని.

నాయ.—(విని) ఏమీ! ఇతనిని వాసుకి త్యజింపనే త్యజించెనా!

కింకరుఁడు.—అబ్బాయీ, పుచ్చుకో ఎఱ్ఱబట్టలను. [ఇచ్చును

శంఖ.—(ఆదరముతో) ఇమ్ము (పుచ్చుకొని) శిరమున స్వామియాజ్ఞ.

వృద్ధ.—(కొడుకుచేతిలో రక్తవస్త్రములను చూచి రొమ్ము బాదుకొనుచు) హా! నాయనా! ఇది పిడుగుదెబ్బగా తగులుచున్నదిరా! [మూర్ఛపోవును.

కింకరుఁడు.—గరుత్మంతుడు వచ్చేవేళ అయినది. త్వరగా నేను వెళ్లిపోతాను. [నిష్క్రమించును.

శంఖ.—అమ్మా, సమాశ్వసిల్లుము.

వృద్ధ.—(సమాశ్వసిల్లి, కన్నీళ్లతో,) ఓరి నాయనా, లెక్కలేని కోరికలచేత గలిగినవాడా, నిన్ను మళ్లీ నే నెక్కడ చూస్తానురా [కంఠము కౌఁగిలించును.

నాయ.—హా! ఎంతక్రూరచిత్తుఁడు గరుత్మంతుఁడు! ఐనను,

చ. కనుఁగవ బాష్పధార లొలుకన్ గడు నేడిచి మూర్ఛబొంగి మే
లక్కనిఁయయో! పుత్త్రకా! యెవరుగాతురు!” యని దిక్కుదిక్కునన్
గని పలవించుతల్లియెదఁ గ్రాలెడుబాలు హరించి మేయుతా
న్పునిహృదయంబు వజ్రమున రూఢిగ నిర్మితమయ్యెఁ జూడఁగాన్

శంఖ.—(కన్నీళ్లను తుడుచుకొనుచు) అమ్మా, ఏల యీ యతివైక్లబ్యము? అమ్మా, సమాశ్వసిల్లుము.

వృద్ధ.—(కన్నీళ్లతో) ఏలాగు సమాశ్వసిల్లుదును? ఏమి? ఎకపుత్రుడవని కనికరంగలవాడై నాగరాజు పంపెనా నిన్ను? హా? కోటానకోట్లుప్రాణులుండగా నా పుత్రకుడే జ్ఞప్తికి రావలెనా? అన్నివిధాలను నే నేదౌర్భాగ్యురాలిని. [మూర్ఛపోవును.

నాయ.—(కరుణతో)

క. దీనున్ శరణవిహీనుం। బ్రాణాపాయప్రసక్తుఁ బంధుతన్ద్యున్
వీనిం గావనయేనిన్। మేనివలన నాకు నేమి మేలు ఘటిల్లెన్,

దగ్గఱకు పోయెదను.

శంఖ.—అమ్మా, ధైర్యము తెచ్చుకో.

వృద్ధ.—హా! కుమార, నాగలోకరక్షకుఁడైన వాసుకే నిన్ను వదలి వేసినాఁడు గదా, ఇక నిన్ను రక్షించేవా రెవరు?

నాయ.—(దగ్గఱకు పోయి) నేను గదా.

వృద్ధ.—(నాయకుని చూచి సంభ్రమమున ఉత్తరీయముతో పుత్త్రుని కప్పివేసి, నాయకునియొద్దకు వచ్చి, మోఁకాళ్లమీఁద నిలిచి) వినతానందనా, నన్ను చంపు, నన్నే నీకు అహారార్థం నాగరాజు పంపినాఁడు.

నాయ.—(కన్నీళ్లతో) అహా! పుత్త్రివాత్సల్యము!

ఆ. పుత్త్రిశోకమునను బొరలాడుచుండిల్లి । గాంచె నేని, యెంతకఠినుఁడైన,
నాగభోజియైన నాగరక్కంతుని । తలఁపు గూడఁగరుణఁదాల్చుఁజూవె

శంఖ.—అమ్మా, భయపడకు, నాగశత్రువు కాఁడు, కాఁడు.

భుజంగప్రయా. మహాహీంద్ర మస్తిష్క మాధ్యోల్బణాసృగ్
బృహత్త్రోటికటీక్ష్ణం డహిద్వేషి యేడక్!
మహాశాంతియుక్ బాలి మల్లాడుమోముక్।
సహం బొప్పు నీకుండసత్త్వత్సుఁ జేడక్!

వృద్ధ.—మమరణానికి భయపడుచూ ఉన్న నాకు లోకమంతా గరుడమయంగానే అవుపడుతున్నది.

నాయ.—అమ్మా, మాటచే నేమిప్రయోజనము? ఇదిగోపనిచేత నేరక్షించెద

వృద్ధ.—(శిరమున అంజలి చేర్చి) పుత్రకా, చిరంకాలం బ్రతుకు.

నాయ.—

ఆ. తల్లి, వధ్యగుర్తు దయచేయుచూ నాకు,। దానిఁ దాల్చి పోయి యేను నీకు
ననుఁగుఁబుత్త్రుఁగాతు, నానికిమూలు గాఁ।దాక్ష్యుఁ డారగింపఁదనొ్న్నసంగి.

వృద్ధ.—(చెవులు మూసికొని అలాగు అక్కరలేదు. ఈయమంగళింతప్పిపోనుగాక. నీవు కూడ శంఖచూడునికన్న వేరుగావు శంఖచూడునికంటె నీవే అధికుడవు, ఎందుచేత నంటే బంధువులుకూడా వదలివేసిన నాకుమారుణ్ణి నీశరీర మిచ్చి రక్షించగోరుతున్నావు.

శంఖ.—అహా! లోకవిపరీతము ఈమహానుభావుని మనస్సు! ఎట్లన.—

(ఇందిరావిలాసవృత్తము.)

మాలవలెఁ గౌశికుఁడు మాన కెంపుల కైశ్వమాంసము న్మను మెక్కినాఁడో,
నాలి యయి గౌతముఁడు నమ్మిరా నుపకర్త నాడిజంఘునిఁ జంపినాఁడో,

వేళ మిగుల నక్షణము వేవ కీగరుడుండు వేగ పాములఁ జంపువాఁడో,
హాళి నలప్రాణముల నట్టె ప్ప్లిటు లీమహాత్ముఁ డన్యుల కిచ్చు నౌరా!

(నాయకు నుద్దేశించి) ఓమహాసత్త్వుఁడా, నీస్వశరీరదాన ప్రయత్నముచేత నే నాయందలి కరుణ ప్రకటమైనది. కనుక యీనిర్బంధము మానుము, చూడు.

క. మావంటిక్షుద్రజంతువు। లేవలనం బుట్ట రెంద చెట నీల్గ రయా?
నీవలె నీగతి నొరులం। గావఁగ ధృతదీక్షుఁ లెచట గలుగుగ రు ధరన్?

నాయ.—శంఖచూడా, నాకు చిరకాంక్షితమై చిరకాలమునకు దొరకిన యీ పరార్థసంపాదనావసరమునకు విఘ్నముచేయుట నీకు న్యాయము గాదు. కనుక ఈవికల్పములు మాని వధ్యచిహ్నమును ఇచ్చివేయుము.

శంఖ.—ఓమహాసత్త్వా, ఈప్రయాసము నిష్ఫలము? శంఖమువలె తెల్లనైన శంఖపాలకులమును శంఖచూడుఁడు నలుపుచేయుఁడుసుమా. నీకు నాయందు దయగల దేని, నావిపత్తుచే బెంబేలుపడునీమె ఎట్లు ప్రాణము వదలకుండునో ఆయుపాయమును ఆలోచింపుము.

నాయ.—ఇక్కడ ఆలోచన కేమున్నది?

ఆ. నీవు చత్తు వేని నిజముగాఁ దాఁ జచ్చు,। నీవు బ్రదుకు దేని నెమ్మిఁ బ్రదుకు,
నట్టియమ్మ బ్రదుక నాస గొందువ యేని। నిన్నుఁ గాచికొనుము న న్నొసంగి.

ఇదే యుపాయము. కనుక త్వరగా వధ్యచిహ్నమును ఇచ్చివేయుము. త్వరగా దానిని ధరించి వధ్యశిలను ఎక్కుగనుగాక. నీవును అమ్మనుతీసికొని నీకు హితముగాని యీప్రదేశమునుండి పొమ్ము. ఒకవేళ చెంత నున్న యీ ఘాతస్థానమును జూచి, అమ్మ స్త్రీస్వభావసులభమయిన భయముచేత ప్రాణము వదలినను వదలును. నీవు చూడవా యేమి చచ్చినపాములకంకాళములచే భయంకరమైన యీ మహాశ్మశానమును? అల్లదిగదా.

స్రగ్ధ. ప్రాంచద్వ్యాబద్ధపక్షద్వమవిధుతిమహాధ్వాంతకృద్గృధ్రసంప
చ్చంచూపుట్యగ్రకృత్తశ్లథపిశితలవాస్వాదసంవృద్ధగర్ధా
పంచాస్యోద్వాంతశావప్రతతిపతననిర్వాణశబ్దాయమానా
చంచత్ప్రీతానలాస్పృగ్రజము వొలయు న్వ్యాసరుద్ధంధ మిందుక్.

శంఖ.—ఎట్లు చూడకుందును?

తే. అహరహంబునహిచ్ఛటాహారమునను। జేయుచుమహాముదంబువి నాయకునకుఁ,
జంద్రధవళకపాలాస్థిసాంద్ర మయ్యు,। శర్వదేహంబువలె, నీశ్మశానమమరు.

కావున త్వరగా పో, ఏల బెదరుపెట్టెదవు? గరుడుఁడు వచ్చువేళ ఆసన్నమయినది సుమా. (తల్లియెదుట మోఁకాళ్లమీఁద నిలిచి) అమ్మా నీవుకూడ ఇఁకను మరలిపో.

క. ఓయమ్మా యింకను నే । నేయేగతియందు జన్మ మెత్తంగలనో
యాయాగతిఁ బ్రియసుత నీ । వే యమ్మవు గమ్మ యాశ్వరేచ్ఛను నాకున్.
[పాదములయందు పడును.

వృద్ధ.—(బాష్పములతో) నాయనా, ఇదే చివరపలుకారి? నిన్నువదలి అవతలికి అడుగుపెట్టను నాకు కాళ్లాడవురా; ఇక్కడనే నీతోకూడానే ఉంటాను.

శంఖ.—(లేచి) పరుగునఁ బోయి నేనును ఈచెంగటి దక్షిణగోకర్ణేశ్వరుని ప్రదక్షిణముచేసి వచ్చి రాజాజ్ఞను నెఱవేర్చెదను. [ఇద్దరును నిష్క్రమింతురు.

నాయ.—(చూచి హర్షముతో) బళి, సిద్ధించినది నాకోరిక, తలఁపని తలంపుగా వచ్చిన యీ రక్తవస్త్రయుగ్మముచేత.

కంచుకి.—(ప్రవేశించి) ఈ వస్త్రయుగ్మమును మిత్రావసుతల్లి దేవిగారు కుమారునికి పంపినారు. దీనిని కుమారుఁడు ధరించును గాక.

నాయ.—(ఆదరముతో) ఇమ్ము. [కంచుకి ఇచ్చును.

నాయ.—(పుచ్చుకొని, ఆత్మగతము) మలయవతివివాహము నాకు సఫలమైనది. (ప్రకాశముగా) కంచుకీ, పో, దేవికి నా నమస్కారమును మనవిచేయుము.

కంచుకి.—కుమారునియాజ్ఞ. [నిష్క్రమించును.

నాయ.—

తే. రక్తవస్త్రద్వయం బిదే రమణ మీఱ
సమయమున కిటు లేతెంచి యమితముదము
నొసఁగుచున్నది మిగులఁ బరోపకృతికి
దేహమును నే సమర్పింపఁ దివురు నాకు.

(దిక్కులుచూచి) మలయపర్వతంపు గుండ్లను దొరలించుచు ఈప్రచండవాయువు రేఁగుటచూడగాఁ పక్షిరాజు దగ్గఱకువచ్చినాఁడని తోఁచుచున్నది. సరియేగదా.

మ.స్ర. ప్రళయాభ్రాభంబులై యభ్రముఁ బొదివె నవే పక్షతిప్రాంతపంక్తుల్,
జలరాశ్యంభంబులై రంహఃశ్వసనమునకు భూశోషణం బాచరించెన్,
గలగుండై కల్పభీ దిక్కరులు వణఁకుచు న్గన్గొన న్ద్వాదశాది
త్యలసత్పక్షద్యుతి న్దిగ్దశక మెసఁగె సంధ్యాపయోదాళియో నాన్.

కనుక ఈ శంఖచూడుఁడు రాకముందే అతిత్వరగా ఈవధ్యశిలను ఎక్కెదను. (అట్లు చేసి కూర్చుండి స్పర్శసుఖమును నటించుచు) అహా! ఏమి దీనిస్పర్శ!

తే. మలయచందనచర్చార్ద్ర మలయవతియు। నిష్టఫలసిద్ధికొఱకు నాశ్లిష్ట యగుచు
నీరుచిరవధ్యశిల యిచ్చునింపులోశ। తాంశమేనియు నాకు నీదయ్యె నహహా!

మలయవతిమాట కేమి?

ఆ. జననియూరువునను శైశవమున హాయి। గాఁ బరున్న నాఁడుఁ గలుగ దయ్యె
వాసి కెక్కు నిపుడు వధ్యశిలోత్సంగ। మునఁ బరున్న నాకు మొనయు సుఖము.

ఓహో! వీఁడుగో గరుత్మంతుఁడు రానే వచ్చినాఁడు. ఒడలెల్ల కప్పుకొనియెద.

[అట్లు చేయును.

[అంతట గరుడుఁడు ప్రవేశించును.]

గరుడుఁడు.—

స్రగ్ధ. తారాప్రాణేశమూర్తి న్దరిసి తలఁచి మత్త్రిస్తుఁ జక్రస్థ శేషుణ్,
జేరి స్ఫీ ద్రోబ్బ వాజు ల్దినమణి యులుక న్దృష్టి న న్న న్న సూడణ్,
దూరాభ్రంబు ల్గరుత్పంక్తులకుఁ దగిలి తద్భూరి శైర్ఘ్యంబు వెంపణ్,
బారంజణ్ జందనాద్రిణ్ బడసితి ఫణభృద్భక్షుశేచ్ఛణ్ క్షుణానణ్.

నాయ.—(పరితోషముతో)

క. ఏపుణ్యము నార్జించితి। నో పాముచు గావ దేహ మొసఁగి యిపుడు నే
నాపుణ్యమునఁ బ్రతిజనిం। బ్రాపించుత దేహ మిటు పరార్థమె నాకుణ్.

గరుడుఁడు.—(నాయకుని చూచి)

శా. ఈవధ్యాశ్మముపై స్వరక్షణపరాహీంద్రాజ్ఞ చేఁ బాతితుణ్
నావజ్రోపమచంచులణ్ డొలిచి హృన్మాంసాస్రముల్ మెక్కుచుణ్
ద్రావణ్ వీనిని హరింతు వే యరుణవస్త్రప్రావృతుణ్ మద్భయ
ప్రావిర్భావవిదీర్యమాణహృదయా స్రవ్యాప్తకల్పున్ ఫణిన్.

[దభాలున పైఁబడి నాయకుని పట్టుకొనును, తెరలో
నుండి పువ్వులు రాలును, దుందుభులు మ్రోఁగును.

గరుడుఁడు.—(ఆశ్చర్యముతో) ఏమి ఇది!

స్రగ్ధ. ఆమాంద్యాకృష్టభృంగంబయి కురిసెడు నేలా యిదే పుష్పవర్షం?
బేమీ దిక్చక్రవాళం బిడియ దివి ఘమాయించు భేరీరవంబుల్?

(నవ్వి) ఆ! తెలిసినది! తెలిసినది!

ఆమందారంబును న్నాహాళహాళిఁ బవనవ్యాప్త కూటాడిపోయెణ్;
భూమ స్సంవర్తకాభ్రంబులు నుఱిమెడు నుద్భూత సంహారశంకన్.

నాయ.—(ఆత్మగతము) బళీ కృతార్థుఁడ నైతిని!

గరుడుఁడు.—(నాయకుని చూచుచు,)

ఆ. నాగరక్షకుండు నాముందు నీరీతిఁ। వఱలుచుంట నధికవశ్యవృత్తి,
సందియంబులేదు చయ్యన నీవేళ। సర్పభోజనేచ్ఛ సమయు నాకు.

వీనిని కొనిపోయి మలయపర్వతశిఖరమువీఁద యథేష్టముగా ఆహారించెదను.

[అందఱును నిష్క్రమింతురు.



## పంచమాంకము.

---

[అంతట ప్రతీహారుఁడు ప్రవేశించును.]

ప్రతీ.—

తే. తనగృహారామమున లెస్స దనరుచున్న
    ననుఁగుకానికొఁ జెల్మి నడలు వోడము;
    దారుణాపాయఘోరకాంతార నాభి
    నుండెనేఁ దల్లడిల్లక యున్నె మనము?

అన్నే జీమూతవాహనుఁడు సముద్రపుఁబోటును జూడఁ గుతూహలముగలవాఁడై పోయి ఇంక రాలేదని మహారాజ విశ్వావసువు దిగులుపడుచున్నాఁడు నన్నిట్లాజ్ఞాపించినాఁడు:—ఏమనఁగా—“సునందా, గరుడుఁడు వచ్చునట్టి యాభయంకరస్థానమునకు అల్లుఁడు జీమూతవాహనుఁడు పోయియున్నాఁడఁట, అందువలన దిగులుగా నున్నది. కనుక త్వరితముగా తెలిసికొనిరా అతఁడు వచ్చినాఁడో రాలేదో.” అని అక్కడికే పోయెదను. (పరిక్రమించుచు ఎదుట చూచి) వీఁడుగో జీమూతవాహనునితండ్రి రాజర్షి జీమూతకేతువు పర్ణశాలముంగిట ధర్మపత్నిచేతను రాజపుత్రిచేతను శుశ్రూషపొందుచు కూర్చున్నాఁడు. అగ్గే,

ఉ. ఫేననిభంబు భంగితము వీచిచలంబగు క్షౌమయుగ్మముం
    బూని యితండు వార్ధియొలుపుం బురణించు, సుతోయయైన గం
    గానది వోలెఁ బుణ్యవతి గాదిలిదేవియు వెంటఁ గొల్వ, వే
    లానిభయై కులంగటను లాలిత కోడలు నుల్లసిల్లఁగాన్.

దగ్గఱకు పోయెదను.

[అంతట భార్యతోను కోడలితోను జీమూతకేతువు ప్రవేశించును.]

జీమూ.—

    భుక్తము లయ్యె యౌవనసుభోగము, లేఁతిఁ గీర్తి యొప్పఁగా
    గిత్తతి, నేకవృత్తిఁ గడతేలెఁ దపంబు, సుతుండు శ్లాఘ్యుఁడై
    త్యక్తరజస్తముండు, సదృశాన్వయసంభవ కోడలీమెయున్,
    వ్యక్తముగాఁగ నే నిఁకఁ గృతార్థత మృత్యువుఁ గోరఁగాఁ దగున.

సునం.—(తటాలున దగ్గఱకువచ్చి) జీమూతవాహనునియొక్క.

జీమూ.—(చెవులుమూసికొని) శాంతము పాపము.

వృద్ధ.—ప్రతిహత మీయమంగళం.

మలయ.—అదురుతూఉన్నది నాహృదయం ఈ దశ్శకునంచేత.

జీమూ.—(ఎడమకన్నదరుటను సూచించి) భద్రా, ఏమి జీమూతవాహనునియొక్క?

సునం.—జీమూతవాహనుని యొక్క వార్తను తెలిసికొని రమ్మని మహారాజ విశ్వావసువు నన్ను మీయొద్దకు పంపించినారు.

జీమూ.—ఏమీ? మాఅబ్బాయి అక్కడ లేఁడా?

వృద్ధ.—(విషాదముతో) మహారాజా, అక్కడ లేకపోతే నాకొమారుడు మరెక్కడికి వెళ్లి ఉంటాడు?

జీమూ.—నిశ్చయముగా మనప్రాణయాత్రకై దవ్వు పోయియుండును.

మలయ.—(విషాదముతో. ఆత్మగతము,) నాకు మతి ఆర్యపుత్రుణ్ణి గురించి ఏమేమో తోస్తూ ఉన్నది.

సునం.—ఆజ్ఞాపింపుఁడు, స్వామికి నేను ఏమి మనవిచేయుదును?

జీమూ.—(ఎడమకన్నదరుటను సూచించి) జీమూతవాహనుఁడు ఆలస్యము చేయుచున్నాఁడని నాహృదయములో మిక్కిలి దిగులుగానున్నది.

క. మితిలేక దరెద వేలా। వెతఁ దెలుపు చదక్షిణాక్షి విసువక నాకున్?
హాత నేత్రమ, నీ తుళ్లును। హాతమార్చును వీఁడుగో సహస్కరుఁడిపుడే.

[ఊర్ధ్వము చూచి) మూఁడులోకములకు ఏకనేత్రమయిన యీవేయి కిరణముల భగవంతుఁడు స్పష్టముగా జీమూతవాహనునికి క్షేమము కలుగఁజేయును. (చూచి ఆశ్చర్యముతో)

శా. ఏమో! హా! యిది మింటిఁ బాసి దిగుచున్ హింసించు నాకన్నులన్,
స్తోమంబౌ తనవెగ్గలో యనఁగ నెత్తుటి ధారగాఁ గారఁగాఁ
నా ప్రామోలం బడెడిన్ దహించుచు వెసన్ నా డెంద మూత్పాతికో
ద్దామాడంబర వాత ధూత నిపతత్తై రాకృతిం బెర్చుచున్.

ఏమి! నా పాదములలోనే పడినది! [అందెలు చూతురు.

జీమూ.—ఏమి ఇది! తడిమాంసముతో కూడిన చూడామణి. ఎవరిదై యుండును?

వృద్ధ.—(విషాదముతో) మహారాజ, మనపిల్లవానదానిలాగ ఉన్నది ఈ చూడారత్నం.

మలయ.—అత్తా, అలాగు అనకండి.

సునం.—మహారాజ, కారణ మెఱుఁగక ఇట్లు ఆశ్చర్యపడ నేల? ఇక్కడ నాగాధిపతులను భక్షించుచు గరుడి పెట్టికవేయుశిరోమణులు ఇట్లు పడుచుండును.

జీమూ.—దేవి! యుక్తియుక్తముగా చెప్పినాఁడు. ఒకవేళ ఇదియు అట్టిదే కావచ్చును,

వృద్ధ.—సునందా, ఈవేళకు మా అబ్బాయి మామగారియింటికే వచ్చియుం టాడు. త్వరగా వెళ్లి తెలుసుకొనిరా.

సునం.—దేవియాజ్ఞ. [నిష్క్రమించును.

జీమూ.—దేవి, ఇది నాగచూడమణియే అగునా?

[అంతట రక్తవస్త్రములు ధరించి శంఖచూడుఁడు ప్రవేశించును.]

శంఖ. - (కన్నీళ్లతో)

తే. అక్కవశటంబునందు గోకర్ణు మ్రొక్కి । పరుగుమైఁ జేరితి భుజంగవధ్యభూమి నింతలోనయ్యయో!చంచుహింసితోరు।నహిభుజుండుహరించె విద్యాధరేంద్రు.

(ఏడ్చుచు, హా! మహాసత్త్వ హా! పరమకారుణిక!హా!నిష్కారణైకబాంధవ! హా! పరదుఃఖదుఃఖిత! ఎక్కడికి పోయితివి? నామాటకు బదులు చెప్పవు! హా!శంఖచూడహతక! ఎంతపని చేసితివిరా!

తే. అహిభగణకీర్తి యొకపూట యైనలేదు
శ్లాఘ్యముగ తోనియానతిసలుపనైతి
నేల నాప్రబదు కొరుఁడు నాకిచ్చెఁ బ్రాణ
మయ్యయో! ఛీ! చెడితిని! నే నయ్యో! చెడితి!

కనుక నేను ఇట్టిబ్రదుకు క్షణమైనను బ్రదికి పరిహాసాస్పదముకాను.ఇతనితో కూడ పోవుటకు యత్నించెదను. (పరిక్రమించి నేలను చూపు నిలిపి)

మ.స్ర సురుచిన్మన్మ్యారిపాత, న్నవిరళపతితస్థూలగోళ న్బిబుందం,
శిరరేపారాల శీర్ణామితతనుకణికల్, మెట్టలల్ గీటకీర్ణల్,
దరలక్ష్య న్ధాతుల, న్సాంద్రతరుశిఖల సంస్త్యానసీలస్వరూపల్,
గరుడుం గానంగ నీరక్తసరణి నెఱుక ల్లాంఛతో వెంబడింతుల్.

వృద్ధ.—(భయముతో) మహారాజ, వీఁడెవఁడో శోకాక్రాంతునిలాగు ఎఱ్ఱని మొగంతో ఇక్కడికే త్వరత్వరగా వస్తున్నాడు వీణ్ణి చూడఁగా నాహృదయము ఏమో దిగులుమంటూఉన్నది వీఁడెవఁడో తెలుసుకోండి.

జీమూ.—దేవి చెప్పినట్లు. (ఆలకించి, హర్షముతో, నవ్వి.) దేవీ, శోకము మానుము. నిజముగా ఇతనిది ఈచూడామణి మాంసలోభముచేత ఏదో పక్షి పెకలించుకొని పోవుచుండఁగా ఇక్కడ పడినది.

వృద్ధ.—(పరితోషముతో మలయవతిని కౌఁగిలించుకొని,) అవిధవా, అధైర్యపడకు. ఈలాగంటియాకారము వైధవ్యదుఃఖానికి పాత్రము కాదు.

మలయ.—అత్తా, మీ ఆశీర్వాదములప్రభావంచేత, [పాదముల వ్రాలును.

జీమూ.— వత్సా! ఏమీ?

శంఖ.--దుఃఖభారముచేతకన్నీళ్లచేకంఠముఉపరుద్ధమై చెప్పఁజాలకున్నాను.

జీమూ. —

తే. చెప్పవయ్య కుమార యీచింత మాని; । నామనంబున దుస్సహమై మదీయ
పుత్త్రశోకంపుదావ ముద్భూత మయ్యె,। దాన నిఁక సహ్య మౌనెద్దియేనివత్స.

శంఖ. — వింటిరుగాక. — నే నొకనాగు,డను, నాపేరు శంఖచూడుఁడు, వాసుకి నన్ను వైనతేయునికి ఆహారముగా పంపినాఁడు. విస్తరమేల? ఒకవేళ ఈ నెత్తురుజాడ గాలికి రేఁగునిసుకచే మాసి అగపడక పోయినను పోవును. కనుక సంగ్రహముగా చెప్పెదను.

క. కరుణాసంపూర్ణాంతః । కరణుండై సాదుప్రాణకంబుల విద్యా
ధరుఁడొకఁడు గాచె గరుడుని। కరుగుగఁ దనదేహ మిచ్చియాహారముగాన్.

జీమూ. — మఱి యెవరు ఇట్టిపరహితపరాయణుఁడు? స్పష్టముగా నే చెప్పవోయి, జీమూతవాహనుఁ డని, హా! మునిఁరిపోయితిని మందభాగ్యుఁడ ను.

వృద్ధ. — హా! పుత్రకా! ఏమి చేసివేసినావు!

మలయ. — అయ్యో! గుర్కునం సత్యమే అయెనుగదా!

[అందఱును మూర్ఛపోవుదురు.

శంఖ. — (బాష్పము తో) నిశ్చయముగా వీరు ఆమహాసత్త్వుని తల్లిదండ్రులు. అయ్యో! అప్రియము చెప్పి వీరిని ముంచివేసితిని! కానీ, విషధరునినోటినుండి విషము తప్ప మఱేమి వచ్చును? ఆహా! ప్రాణదాతయైన జీమూతవాహనునికి తగినట్లు ప్రత్యుపకారము చేసినాఁడు శంఖచూడుఁడు! ఇంకను ఇప్పుడే ఆత్మహత్య చేసికొందునా! వలదు. వీరిని ఓదార్చెదనుగాక, బాబూ, సమాశ్వసిల్లుము. అమ్మా, సమాశ్వసిల్లుము.

[ఇద్దఱును సమాశ్వసిల్లుదురు,

వృద్ధ. — వత్సా, లేవే, ఎడవకే. మనము జీమూతవాహనుణ్ణి వదిలి బ్రతుకుతామా ఏమి? కనక నిబ్బరపడు.

మలయ. — (సమాశ్వసిల్లి) ఆర్యపుత్రా, నిన్ను నేను ఇక ఎక్కడ చూడవలసింది?

జీమూ. — హా! వత్సా, గురుచరణశుశ్రూషావిధిజ్ఞ!

ర. నాచరణంబులలోనే । యీచూడామణిని వైచి యీ వనయము నీ
యాచారమయినవినయముఁ । బ్రోచితి లోకాంతరంబు పోయియుఁబుత్త్రా.

(చూడామణిని చేత దీసికొని) హా! వత్స, ఏమి ఇంతమాత్రమే అగపడువాఁడవైతివి? (హృదయములో నుంచుకొని) అహహా!

ఉ. చాలఁగ నమ్రమూర్తి వయి సారె మదంఘ్రుల కీవు భక్తిమై
వ్రాలఁగ నీశిరోమణియవంధ్యతఁ జేరియు నోవొసంగదే!
బాలకయిప్డు చెంగటను బట్టినమాత్రన నాదుడెందముం
జీలుచుఁ గాల్చు నేలొకొ వచింపుము హా! పితృమాతృవత్సలా!

వృద్ధ. హా! పుత్ర, జీమూతవాహన! ఏనీవు గురుశుశ్రూష తప్ప వేఱేసుఖం రుచించదో అటువంటి నీవు ఇప్పుడు మీ నాయనను వదలిస్వర్గసుఖం అనుభవించడానికి ఎలాగు వెళ్లిపోయినావు?

జీమూ.—(కన్నీళ్లతో) దేవి, ఎల ఇట్లు ప్రలపించెదవు? మన మేమి జీమూతవాహనుఁడు లేక జీవించెదమా?

మలయ.—(పాదములయందు పడి చేతులు మొగుడ్చుకొని) అటయితే ఆర్యపుత్రుని చిహ్నమైన యీ చూడామణిని నాకు దయచేయండి. దాన్ని హృదయాన ఉంచుకొని అగ్నిప్రవేశంచేసి హృదయముయొక్క సంతాపాన్ని పోగొట్టుకొంటాను.

జీమూ.—పతివ్రత, ఏల యిట్లు వ్యాకులపడియెదవు? మనకందఱికిని అదేగతి.

వృద్ధ.—మహారాజ, మఱియేల మనం ఆలస్యం చేయుడం?

జీమూ.—ఎందునకును లేదు దేవీ, అయినను ఆహితాగ్నికి ఇతరాగ్నిచేత సంస్కారము విధింపఁబడలేదు. కనుక అగ్నిహోత్రగృహమునుండి అగ్ని తెచ్చి మనలను దహించుకొందము.

శంఖ.—(ఆత్మగతము) కటకటా! నాయొక్కనికొఱకు ఈవిద్యాధరకులము సర్వము ఉత్సన్నము కానున్నది! ఇట్లు చెప్పెదను గాక. (ప్రకాశముగా) బాబూ, వాస్తవమును నిశ్చయింపకయే ఇట్లు సాహసించుట యుక్తము గాదు, దైవవిలసితములు విచారసహితములు. ఒకవేళ, ఇతఁడు నాగుఁడు గాఁడని తెలిసికొని, నాగశత్రువు విడిచిపెట్టినను విడిచిపెట్టును. కనుక ఈదిక్కుననే గరుత్మంతుని వెదకుదము.

వృద్ధ.— అన్నివిధాల దేవతలప్రసాదంచేత సుజీవుఁడైన పుత్రునిముఖాన్ని చూతముగాక.

మలయ.—(ఆత్మగతము) దుర్లభం సుమా యిది నాకు మందభాగ్యురాలికి.

జీమూ.—వత్సా, నీవాక్కు సత్యమే యగును గాక. అయినను అగ్నినికూడ తీసుకొనియే మేము రాఁదగును. నీవు ముందు వెదకుము. మేమును అగ్నిగృహము నుండి అగ్నిని తెచ్చుకొని త్వరగానే నిన్ను కలసికొనెదము.

[భార్యతోను కోడలితోను నిష్క్రమించును.

శంఖ.—ఇంక గరుడుని వెంబడించెదను. (ఎదుట చూచి)

శా. పాటీరాచలకూటకోటి నదె గన్పట్టున్ ఖగేంద్రుం డసృ
గ్ధాటాక్తంబగుత్రోటి దీటి వానలం గల్పించుచున్ గ్రొత్తగాఁ
గాటిన్ ఖూదిగ నేర్వఁగాఁ దనకను ల్కాలాగ్నిఁ బోల్చాపులన్
గాటంబై దిగ వజ్రఘోరనఖరాగ్రంబుల్ ధరామండలిన్.

[అంతట ఆసనస్థుఁడై గరుడుఁడును, అతనిముందఱ వెదకిలంబడి
నాయకుఁడును, ప్రవేశింతురు.]

గరుడుఁడు— (ఆత్మగతము) నాజన్మము మొదలు నేను నానాభుజంగపతులను భుజించుచుంటిని గాని ఇట్టియద్భుతము నెన్నఁడును చూచియెఱుఁగను. ఏమనఁగా, ఈమహాత్ముఁడు బాధపడమి మాత్రమే గాక ఏమో ఆనందమగ్నుఁడుగా అగపడుచున్నాఁడు. అల్లే

శా. క్రౌలున్ దుష్టియ యెంత త్రాగినను రక్తం బంత, నానామిషా
భీలోత్కృత్తనతీవ్రవేదనలకున్ బ్రీతిప్రసన్నంబు మో,
మాలోకింపని యంగ మేదో యది గోమాంచాంకితం బౌను, జూ
పాలోకించు మహోపకారి బలె నత్యంతాపకారిన్ ననున్.

కనుక ఈయనయొక్క యీధైర్యవృత్తిచేత నాకు కుతూహలమే కలుగుచున్నది. కాని ఇతనిని భక్షింపను. అడిగిచూచెదను, ఇతఁ డెవఁడో.

నాయ.—

ఆ. నాడులందు నిఁక నల్ల లొల్కెడుఁ జూడు
మేన నింక నెఱచి మెసవఁ గలదు
కానరావు తృప్తగ్గైన యట్లు మహాత్మ
బోన మేల గురుడి మానితయ్యా.

గరుడుఁడు.—(స్వగతము) ఆశ్చర్య మాశ్చర్యము! ఏమి! ఇట్టి యవస్థలోఁ గూడ ఇట్లు ఊర్జితముగా పలుకుచున్నాఁడు! (ప్రకాశము)

క. నిహృద్రక్తముఁ ద్రోటిన్। నే హరియించితిని, దాన నే మగు; నీ వీ
నా హృద్రక్తము నీధృతి। చే హరియించినవిధంబు చెలఁగ మహాత్మా.

కనుక నీ వెవఁడవో వినఁగోరెదను.

నాయ.—ఇట్లు ఆఁకలిచే బాధపడుచున్న నీవు వినిపింపఁదగినస్థితిలో లేవు. నారక్తమాంసములచేత తృప్తిచేసికొమ్ము.

శంఖ.—(తటాలున వచ్చి) తార్క్ష్య, వదలు వదలు, సాహసము చేయకు. ఇతఁడు నాగుఁడు కాఁడు. ఇతనిని వదలుము. నన్ను భక్షింపుము. నేను నీకు ఆహారార్థము వాసుకి పంపినవాఁడను. [బొమ్మను ఇచ్చును.

నాయ.—(శంఖచూడుని చూచి) అయ్యో! నాకోరిక విఫలమాయెను. శంఖచూడుని రాకచేత!

గరుడుఁడు.—(ఇద్దఱిని చూచి) మీకిద్దఱకును వధ్యచిహ్నముకలదు. ఎవఁడు నాగుఁడో తెలిసికొనఁజాలకున్నాను.

శంఖ. —యుక్తమే యీభ్రాంతి. అయినను,

శా. ఉండుంగాకెద స్వస్తికంబు కుబుసం బొప్పారదే మేన? రెం
డ్రెండౌనాల్కల నెన్నవె ల్లెదుర నే నేఁబల్కఁగాఁ? జూడ వె
ట్లుండఁ దీవ్రవిషాగ్ని ధూమపటలవ్యాజిహ్మరత్నార్చి ను
ద్దండాత్యుత్కటశోక సీత్కృతమరుద్బాధన్ ఫణామండలిన్.

గరుడుఁడు. —(ఇద్దఱిని చూచి శంఖచూడుని పడగలనుచూచి) అట్లయిన నేను భక్షించిన యితఁ డెవరు?

శంఖ.—విద్యాధరవంశతిలకమయిన జీమూతవాహనుఁడు. ఎట్లు అకారుణికుఁడవై యిట్టి యకృత్యము చేసితివి?

గరుడుఁడు.—హా! ఏమిచేసితిని! ఇతఁడు విద్యాధరకుమారుఁడు జీమూతవాహనుఁడా? అతఁడా యితఁడు?

ఉ. మేరువుపై, మహేంద్రతట మేదిని, మందరకందరాళి, నీ
హారగిరిన్ హరాద్రి. మలయాద్రిని, దిక్కుల విందు నెల్లెడన్,
వారక యేమహామహుని వంద్యయశంబును, జక్రవాళసం
చారపరాయణప్రగుణచారణమండలి పాడుచుండఁగాన్.

సర్వథా మహత్తరమైన పాపపంకమందు మునిఁగిపోయితిని!

నాయ.—ఓఫణిపతీ, ఏల యిట్లు ఉద్విగ్నుఁడ వయ్యెదవు?

శంఖ.—ఏమి? ఇది ఉద్వేగమునకు కారణము గాదా?

క. ఈలీలన్ నీదేహము। వ్యాళారికిఁ బెట్టి నేను బ్రదుకుదు నేనిన్
బోలున్ దోఁయంగాఁ బా। తాళతలంబునకుఁ గ్రింది తలమునకు ననున్.

గరుడుఁడు.—ఓహో కరుణార్ద్రచిత్తుఁడై యీ మహానుభావుఁడు నాకు భోజనము గాఏర్పడిన పాముయొక్క ప్రాణములను కాపాడుటకు తనదేహమును ఇచ్చి

నాఁడు. వేయేల? బోధిసత్త్వనే యితనిని చంపివేసితిని. ఈమహాపాపమునకు అగ్ని ప్రవేశముకంటె వేఱుప్రాయశ్చిత్తము అగపడదు. ఇప్పుడు నాకు అగ్ని ఎక్కడ దొరకును? (దిక్కులఁ జూచి) బళీ, వీ రెవరో నిప్పుతెచ్చుచు ఇటే వచ్చుచున్నారు. సరి, వీరు వచ్చువఱకు ఎదురుచూచెదను.

శంఖ.—కుమార, నీతల్లిదండ్రులు వచ్చినారు.

నాయ.—(సంభ్రమముతో) శంఖచూడ, చక్కఁగా కూర్చుండి నాశరీరమును ఉత్తరీయముతో కప్పి నన్ను లేవనెత్తి పట్టుకొమ్ము. అట్లు చేయనియెడల ఈ స్థితిలోనున్న నన్ను తటాలున చూచి అమ్మ ప్రాణము విడిచినను విడుచును.

[శంఖచూడుఁడు ప్రక్కను పడియున్న యుత్తరీయము నెత్తి అట్లే చేయును.

[అంతట భార్యావధూ సమేతుఁడై జీమూతకేతువు ప్రవేశించును.]

జీమూ.—(కన్నీళ్లతో) హా! పుత్త్ర! జీమూతవాహన!

మ. తనవాఁ డన్యుఁ డటంచు భేదము కృప న్గర్హ్యంబుగా లేద; యొ
క్కనినో పెక్కురనో తగు న్మనుప నాఘర్షింపవే యాత్మలో!
తనివిన్ బాయును దార్ఢ్యనుండి మనుప న్దత్తాత్మదేహుండ వై
నినుఁ దల్లి న్సిత భార్యఁ జంపి కులము న్నిశ్శేషము న్జేసితే.

వృద్ధ.—(మలయవతి నుద్దేశించి) వత్సా, రవంతసేపు ఊరుకోవే. ఎడతెంపు లేక పడుతున్న బాష్పధారలచేత అగ్ని ఆరిపోతుంది. [అందఱు పరిక్రమింతురు.

జీమూ.—హా పుత్త్ర, జీమూతవాహన!

గరుడుఁడు.—(విని) 'హా! పుత్త్ర! జీమూతవాహన!' అనుచున్నాఁడు. నిశ్చయము ఇతఁడే ఇతనితండ్రి. ఇతనియగ్నితో నన్ను నేను ఎట్లు దహించుకొందును? పుత్త్రఘాతలజ్జచేత ఇతనికి ముఖము చూపనైనను శక్తుఁడను కాను. కాని అగ్నికోసము ఇంత విచార మేల? గట్టుననే కదా ఉన్నాను సముద్రమునకు. కనుక ఇప్పుడు:

స్రగ్ధ. కాలాంతాక్రాంతవిశ్వగ్రసనరసలసత్కాలజిహ్వాకరాళ
జ్వాలావాచాల సప్తాశ్వకబళనవిధావర్ధమాన ప్రసర్పత్
వ్యాలోలోత్పాతవాతప్రసరపటిమమత్పక్షసంధుక్షితార్చిః
ప్రాలంగాఁ బోయెద న్గల్పదహనభయద న్బాడబాభోగనాభిన్.

[అని లేవఁగోరును.

నాయ.—ఓపక్షిరాజా, ఈప్రయత్నము చాలింపుము. ఈపాపమునకు ఇది గాదు ప్రతీకారము.

గరుడుఁడు.—(మోఁకాళ్లమీఁద నిలిచి అంజలి చేర్చి) ఓమహాత్మా, మఱి యేదో చెప్పుము.

నాయ.—ఒకక్షణము ఓపికచేయుము. నా తలిదండ్రులు వచ్చియున్నారు. వీరిని నమస్కరించెదను.

గరుడుఁడు.—అట్లే చేయుము.

జీమూ.—(చూచి, హర్షముతో,) దేవి, నీపుణ్యము బాగుగానున్నది. వీఁడు గో నాయన జీమూతవాహనుఁడు, కేవలము బ్రదికియుండుటయే కాక, కృతాంజలి యైన గరుడునిచే ఉపాసింపఁబడుచున్నాఁడు.

వృద్ధ.—మహారాజ ధన్యురాలినైతిని. అక్షతశరీరుఁడైన కుమారునిముఖము చూతును గాక.

మలయ.—నేను ఆర్యపుత్రుణ్ణి మాస్తూనే అతిప్రియము గనక నమ్మలేకుండా ఉన్నాను.

జీమూ.—(దగ్గఱకు వచ్చి) వత్సా, రా, రా, నన్ను కౌఁగిలించుకో

[నాయకుఁడు లేవఁగోరును ఉత్తరీయము జాఱి పడిపోయి మూర్ఛిల్లును.

శంఖ.—కుమార, సమాశ్వసిల్లుము, సమాశ్వసిల్లుము.

జీమూ.—హా వత్స! ఏల నన్నుచూచి మూర్ఛపోయితివి?

వృద్ధ.—హా నాయనా, మాటమాత్రాననైనా నన్ను ఆదరించవేమి?

మలయ.—హా ఆర్యపుత్ర! గురుజనులనుకూడా నీవు చూడగూడదా ఏమి?

[అందఱును మూర్ఛిల్లుదురు.

శంఖ.—హా శంఖచూడహతక! నీవు ఏలరా కడుపులోనే చావవైతివి? అట్లయిన క్షణక్షణమును ఇట్టి మరణాధికదుఃఖమును అనుభవింపవుగదరా!

గరుడుఁడు.—ఇది అంతయు ఘాతకుఁడనైన నా దుర్వ్యవస్థకారితయొక్క విజృంభితము. ఇట్లు చేసెదను. (ఱెక్కలతో విసరుచు) ఓమహాత్మా, సమాశ్వసిల్లుము, సమాశ్వసిల్లుము.

నాయ.—(సమాశ్వసిల్లి) శంఖచూడ, గురువులను సమాశ్వాసింపుము.

శంఖ.—బాబూ, సమాశ్వసిల్లుము సమాశ్వసిల్లుము. అమ్మా సమాశ్వసిల్లుము సమాశ్వసిల్లుము. [ఇద్దఱును సమాశ్వసిల్లుదురు.

వృద్ధ.—ఏమి నాయనా, మేము చూస్తుండగానే నా నిన్ను యమధర్మరాజ హతకుడు అపహరిస్తున్నాడు!

జీమూ.—దేవి, ఇట్లు అమంగళవచనములు పలుకకు. చిరంజీవి బ్రదికియే యున్నాఁడు. కోడలిని ఓదార్పుము.

వృద్ధ.—(ముఖమునకు వస్త్రము కప్పుకొని ఏడ్చి) ప్రతిహతం అమంగళం. ఏడవకు. మలయవతీ, సమాశ్వసించు, వత్సా, లేవే. ఈసమయంలో భర్తముఖం చూడు.

మలయ.—(సమాశ్వసించి) హా ఆర్యపుత్ర!

వృద్ధ —(మలయవతిని నోరుమూసి) వత్సా! ఈలాగుచేయకే, ప్రతిహతంఇది.

జీమూకే —(కన్నీళ్లతో ఆత్మగతము)

ఆ. గాత్రశేష మెల్ల గళిత మాటను గంర । సీమ నిల్వ లేమిఁ జెల్లు ననఁగఁ
ప్రాణ ముత్క్రమించుపట్టిని గాంచియు । బ్రయ్యు నేమి వేయివగల వగల ।

మలయ.—హా ఆర్యపుత్ర! అతి దుష్కరకారిణిని సుమా నేను. ఇట్లున్న యార్యపుత్రుని చూచుచునే ఇప్పటికిని ప్రాణమును వదలకున్నాను!

వృద్ధ.—(నాయకుని యువయువములను తడవుచు గరుడుని ఉద్దేశించి) ఓయి నిశ్శంకుఁడా ఇప్పుడిప్పుడే యౌవనశోభ యెక్కుతున్న నాపుత్రకుని యీశరీరాన్ని ఈయవస్థకు తేవడానికి నీకు ఏలాగు మనసొప్పింది?

నాయ.—అమ్మా, అట్లు గాదు. ఇతఁ డేమిచేసినాఁడు? ఇంతకుముంగు కూడ ఇది పరమార్థముచేత ఇట్టిదే గదా? చూడు,

తే. తోలు గూసినయస్థి మేదోరసాంత్ర। రక్తసంఘాత మీశరీరంబు, దీన
శోభయు నొకండు గలుగునే యిుడఁగా న। దావిభావితబీభత్స దర్శనమున?

గరుడుఁడు.—ఓమహాత్మా, నరకాగ్నిజ్వాలావలీఢుని గా నన్ను తలఁచుకొను చు కష్టముతోనున్నాను. కనుక ఈపాపము నన్ను ఎట్లు విడుచునో ఉపదేశింపుము.

నాయ.—నాయనా, నాకు ఆజ్ఞ యిమ్ము. ఇతనికి పాపమునకు ప్రాయశ్చిత్తము చెప్పెదను.

జీమూ.—వత్సా, మంచిది; అట్లు చేయుము.

నాయ.—వైనతేయుఁడా, వినవోయి.

గరుడుఁడు.—(అంజలి చేసి) ఆజ్ఞాపింపుము.

నాయ.—

ఉ. చేయకు హింస, కుందు ముసు జేసినదానికి, నెల్లప్రాణులం
బాయక ప్రోచి పుణ్యప్రవాహ ముపార్జనసేయు, మందులో

నే యడఁగారి ప్రాకృతవధాఘము భర్జిత బీజకల్ప మై
యాయతి నాత్మ కార్యకరణాక్షమ మా నది నుప్పతావలెన్.

గరుడుఁడు.—నీయాజ్ఞ.

క. పాదివినయజ్ఞానం బను । నిదురన్ సంసృతికలన్ మునిఁగి నీకృపకుం
బదమై మేల్కని లేచితి! వదలితి వదలితిని ప్రాణివధము మహాత్మా.

ఇది మొదలుగా,

ఉ. ఒక్కెడ సైకతాంతతఫణోచ్ఛ్రితి దీవివలె న్దలిర్పఁగా,
నొక్కెడ భోగచక్రము మహోగ్ర జలభ్రమవిభ్రమం బిడన్,
ఒక్కెడ నొడ్డునుండి పెరయొడ్డున కేఁగుచు సేతురూప మై,
యక్కఱఁ జేరఁగా కహిసమాజము పేరెలమి న్మహాంబుధిన్.

మఱియు,

మ.స్ర. తలకట్టు ల్వీడి యాపాదము పొదువ ఘనధ్వాంతము న్బోలె, గండ
స్థలము ల్బాలాతపారక్తత వెలుఁగఁగఁ జెంద్రంపులేఁబూఁతఁబోలెన్,
అలసాంగు ల్దొర్గి సేద న్మరువున మలయప్రాంతపాటీరవాటిన్
బలురక్తి న్నిరుకీర్తి న్ఫణధరయువతు ల్పాడెదు న్గాతఁ ప్రీతిన్.

నాయ.—మేలు మహాసత్త్వుఁడా, మేలు. సంతోషించితిని. అన్ని విధముల దృఢసమాధానుఁడవు గమ్ము. (శంఖచూడుని నిర్దేశించి) శంఖచూడ, నీవు ఇంటికి త్వరగా పొమ్ము. [శంఖచూడుఁడు నిశ్వసించి అధోముఖుఁడై నిలిచియుండును.

నాయ.—(నిశ్వసించి తల్లిని చూచుచు)

ఆ. నిన్న గనుడి డోలుచుచున్నరూపము గుదిఁ
దఁలచి తలఁచి యమ్మ తాపభరము
సైఁరలేక ఱోలి చచ్చిన ట్లయియుండు;
నామ దేర్పఁ బోవె యతిరయమున?

వృద్ధ.—(కన్నీళ్లతో) ధన్యురాలు సుమా ఆతిల్లి, ఎవతె గరుత్మంతుడిముఖం లో పడినవాడైనా అక్షతశరీరుడైన పుత్రుడిముఖం చూస్తుందో.

శంఖ.—అమ్మా, వాస్తవమే కుమారుఁడు స్వస్థుఁ డగు నేని.

నాయ.—(వేదనను నటించుచు) హాహా, పరార్థసంపాదనరస పారవశ్యము చేత ఇంతసేపు నాకు తెలియక పోయినది. ఇప్పుడు మర్మచ్ఛేదకములై వేదనలు నన్ను బాధించుచున్నవి. [మరణావస్థను నటించును.

జీమూ.—(సంభ్రమముతో) హా వత్సా, ఏమి ఇట్లు చేయుచున్నావు?

వృద్ధ.—హా ఏమి ఈలాగు అంటున్నాడు. (బొమ్మబాదుకొనుచు) కావరయ్యా కావరయ్యా ఇదుగో నాకొమారుడు జీవం విడుస్తున్నాడు.

మలయ.—హా ఆర్యపుత్ర! వదలిపొయ్యేవానిలాగ ఉన్నావు.

నాయ.—(అంజలి చేర్పఁగోరుచు) శంఖచూడ, నాచేతులను కలియఁబట్టుము.

శంఖ.—(అట్లు చేయుచు) కట్టా, లోకము చీఁకటియైపోయినది.

నాయ.—(సగము కన్నుదెఱచి తండ్రిని తల్లిని చూచుచు) నాయనా, అమ్మా ఇదే నా యంత్యనమస్కారము.

వసం ఇయ్యంగముల్ సరి! వహింపవు చేతనన్ హా!
అయ్యో కటా శ్రుతు లనక్షరధారకంబుల్!
అయ్యయ్యొ యుద్ధవిడి నత్తులు మూఁత లాయెన్!
అయ్యా, వసంబెడలెఁ బ్రాణము లేచె నేఁగన్.

పోనీ, 'ఏపుణ్యము నార్జించితినో' [ఇత్యాది చదివి పడిపోవును.

వృద్ధ—హా పుత్ర! హావత్స! హా గురుజనవత్సల! ఎక్కడున్నావు? నాకు ఉత్తరం చెప్పు.

జీమూ.—హా వత్స! జీమూతవాహన! హా ప్రణయిజనవల్లభ! హా సర్వగుణనిధీ! ఎక్కడ నున్నావు? నాకు ఉత్తర మిమ్ము. (చేయెత్తి) అయ్యో కటకటా!

శిఖ. నిరాధారం బయ్యె న్వినయ, మిఁ కెట స్థిరత చనున్?
విరామం బొందె న్దానము. క్షమ యిఁ కేవెంట నొదుగున్?
బరాస్తం బయ్యె న్సత్యము. కృప యెట న్బ్రొకు? జగమున్
హరా! శూన్యం బీ వో తనయ, గన లోకాంతరరతిన్.

మలయ.—హా ఆర్యపుత్ర, ఏలాగు వదలిపోయినావు? అతిక్రూరురాలా మలయవతీ, నీ వింకా ఏమి చూడవలిసిఉన్నది? ఇంతకాలం బ్రతికినావుగదా!

శంఖ.—హా కుమార, ప్రాణములకంటెను ప్రియమయిన యీజనుని వదలి ఎట్లు పోవుచున్నావు? కనుక అవశ్యముగా నిన్ను శంఖచూడుఁడు వెంబడింపక మానఁడు.

గరుడుఁడు.—కటకటా! ఈమహాత్ముఁడు మృతింపనే మృతించినాఁడు. ఇఁకను ఇప్పుడు ఏమి చేయుదును?

వృద్ధ.—(కన్నీళ్లతో ఊర్ధ్వము చూచి) ఓ వేల్పులార, లోకపాలకులార, ఏలాగైనా అమృతమైనా పైన చిలికి నా పుత్రుణ్ణి బ్రతికించరయ్యా.

గరుడుఁడు.—అమృతకీర్తనచే సమయమునకు చక్కఁగాఁ జ్ఞాపకమయినది. అపకీర్తి పోయినది, పోయి దేవేంద్రుని ప్రార్థించి అతఁడు కురియించు నమృతవర్షము చేత జీమూతవాహనునిమాత్రమే గాక పూర్వభక్షితములై అస్థిశేషములై పడియున్న నాగపతులను కూడ బ్రదికించెదను. అతఁడు గనుక ఇయ్యకపోయెనా

ఉ. రెక్కలధాటి వారినిధి రిక్తముఁ జేసి జవానుగేరణన్
దృక్కుల నర్కు లందఱను దీలుగ నేర్చి, కృశాను నార్పి, యీ
ముక్కున నింద్రు వజ్రమును ముగ్గగఁ గొట్టి, సురాళిఁ గిట్టి, నేఁ
గ్రక్కునఁ గ్రుమ్మరించెద నఖండ సుధారస కుంభవర్షమున్.

కనుక నేను ఇదిగో పోయినాఁడను.

[అని ఆటోపముతో పరిక్రమించి నిష్క్రమించును.

జీమూ.—వత్స శంఖచూడ, ఇఁక నేల ఆలస్యము? కట్టెలను తెచ్చి నా కుమారునికి చిత పేర్పుము. అందులో పడి మేమును వానితోకూడనే పోయెదము.

వృద్ధ.—పుత్ర శంఖచూడా, శీఘ్రంగా పేర్చు. నీయన్న మేములేక దుఃఖ పడుతూ ఉంటాడు.

శంఖ.—(కన్నీళ్లతో) గురువులయాజ్ఞ. నేను మీకన్న ముందే సుమా (లేచి చితను పేర్చి) బాబూ, అమ్మా, చిత సిద్ధముగా నున్నది.

జీమూ.—దేవి, ఇఁక నేల యేడ్పు? లే ఇఁక చిత యెక్కుదము.

[అందఱును లేతురు.

మలయ.—(అంజలి చేసి ఊర్ధ్వము చూచుచు) భగవతీ గౌరీ, విద్యాధర చక్రవర్తి నీకు భర్త అగునని వరమిచ్చినావు. అయినా నాదౌర్భాగ్యంవల్ల నీమాట కూడా మాయ అయిపోయింది గదా.

[అంతట సంభ్రమమున గౌరి ప్రవేశించును.]

గౌరి.—మహారాజ, జీమూతకేతూ, వలదు, వలదు, సాహసము వలదు.

జీమూ.—అహా! ఏమి! అమోఘదర్శన గౌరి!

గౌరి.—(మలయవతిని ఉద్దేశించి) వత్సా, నామాట మాయ యెట్లు అగును? (నాయకుని దరిసి కమండలుజలమును అతనిమీఁద చిలుకరించి)

ఆ. ఆత్మజీవితంబు నర్పించి యేనియు। జగములకు హితంబు సలుపునిన్ను
శిశువ మెచ్చుకొంటి జీమూతవాహన। బ్రదుకవయ్య లేచి భద్రముగను.

[నాయకుఁడు లేచును.

జీమూ. —(హర్షముతో) దేవీ, భళీ నీపుణ్యము పండినదిలే, మననాయన బ్రదికినాఁడు.

వృద్ధ. —భగవతియొక్క ప్రసాదముచేత.

నాయ. —(గౌరిని చూచి అంజలి చేర్చి) ఓహో ఏమి! అమోఘదర్శన భగవతి!

క. వరియించువరము లెల్లను। గరుశించెదుతల్లి, ప్రణతగణములబాముల్
హరియించుగౌరి, విద్యా। ధరవందిత దేవి! నీపదముల కెఱఁగెదన్.

[అని గౌరి పాదములలో పడును అందఱు ఊర్ధ్వము చూతురు.

జీమూ. —ఏమి! ఇది ఎట్లు గలిగినది? మబ్బులేనివాన! భగవతీ, ఇదేమి?

గౌరి. —రాజా! జీమూతకేతూ, జీమూతవాహనుని బ్రదికించుటకును, అస్థిశేషులైన యీనాగపతులను బ్రదికించుటకును. పశ్చాత్తప్తుఁడైన పక్షిరాజు దేవలోకమునుండి ఈయమృతవర్షమును కురియించినాఁడు, (వ్రేలితో నిర్దేశించి) ఏమి నీవు చూడలేదా?

ఉ. కవ్వము శంఖమాడు, బిగికాఁగిటఁ గ్రుచ్చుచు, ముద్దుఁగొంచుఁ, బె
న్దవ్వు శిరోమణుల్ వెలుఁగ, ధాత్రి సుధారసలిప్సనాకుచున్,
రివ్వనఁ జందనాచలసరిత్తతియో యన వక్రగాములై,
యివ్వె కుమారు ద్రొక్కుచు, ఫణీంద్రము లంబుధిలోనఁ జొచ్చెడున్.

(నాయకు నుద్దేశించి) వత్స, జీమూతవాహన. నీవు ప్రాణదానమునకు మాత్రమా ప్రాతమవు? ఇదిగో నీకు ఇంకొక ప్రసాదము.

శా. శ్రీవెల్గన్ సృజియించి రత్నఘటులన్ గ్రీడన్మరాళీచల
త్సౌవర్ణాంబుజరేణుపంకిలమహాస్సంభావితాంభంబులన్
వావృత్తాభిషవంబు సర్వజగతీవంద్యంబుగాఁ జేసి నే
నే విద్యాధరచక్రవర్తిగ నిను న్నేమించితిన్ బ్రీతితోన్.

మఱియు,

శా. నీమ్రోలన్ జన నాత్మదీధితిసదానీరాజితాత్మస్థిత
శ్రీమాన్యంబగుమండలాగ్రమును నీశ్వేతంపుఁజౌదంతియున్
శ్యామంబౌహరిరాజము న్మలయయ న్వశ్రేయసంబైనయీ
నామాణిక్యచతుష్టయంబుఁగొనరా నాచక్రవర్తీశ్వరా.

మఱియు, చూడు వీరుగో శరత్కాలచంద్రునివలె నిర్మలమైన వీచోపులు చేత ధరించి, ఆభరణమణికిరణములచేత ఇంద్రచాపరచనలను చేయుచు, భక్తిచే

పూర్వకాయములను వంచి వంగివంగి నీకు నమస్కరించుచున్నారు మతంగహాతకాదివిద్యాధరపతులు. నీకు ఇంకను ఏమి ప్రియము చేయవలయునో చెప్పుము.

నాయ.—ఇంతకన్నను ప్రియముండునా!

స్రగ్ధ. రక్షాప్తిన్ శంఖచూడోరగుఁ డలరెఁ బతద్రాజు సన్మార్గుఁ డయ్యెన్,
భక్షింపంబడ్డయాసర్పపతులు మరలం బ్రాణముం బొంది, రే ని
ట్లక్షీణాసుండఁగా నవ్యసులు గురువులై, రైతి నేఁ జక్రవర్తిన్,
సాక్షాత్తు దేవిఁగంటి; న్సకలము ప్రియ మాశాస్యమింకన్నెయెంకన్!

అయినను ఇది యగునుగాక భరతవాక్యము.

శా. వృష్టి న్హృష్టశిఖండితాండవముగా వేళ న్ఘను ల్సేయుచున్
స్పష్టశ్రీ నొనరింత్రు గావుత హరిత్సస్యోత్తరీయన్ క్షితిన్,
బుష్టోదారత సంగ్రహించి సుకృతంబు న్సేయ మొప్ప న్జను
ల్దుష్టిం గేరెదుఁగాత బాంధవసుహృద్గోష్టీవినోదంబులన్.

[అందఱు నిష్క్రమింతురు.

నాగానందనాటకము.

సమాప్తము,

5. విలు.—విలు తెగఁగొంచు = వింటిని ఆకర్షించుచు, ఢక్కన్=మృదంగమును, తత్=మారునియొక్క, జంకెనలు = బెదరింపులు, లేనగవు = లేఁతనవ్వు, తెలచుచున్ = నమస్కరించుచు; ధ్యాయిన్ = ధ్యానముచేయువానిని-సమాధినిష్ఠుని, యమిని = యమములుగలవానిని - యతిని. 7. జనకుని.— ధృతి= ఆనందము, రాజకము = రాజసమూహము, తత్ ఈప్సిత భుక్తి అవశిష్టభుక్తికిన్ = తండ్రికి కావలసినది ఆయన యనుభవించినపిమ్మట మిగిలినదాని ననుభవించుటకు, వనటయ = దుఃఖమే, ఆత్మ పితృ వర్జికి=తన తల్లిదండ్రులను వదలువానికి, న్యాయ.— నా సరి= నాకు సమానులను, రాయల = రాజులయొక్క, రక్షి= సేనాపతులు మొదలయిన రక్షకులయొక్క, పాదపరాజము = వృక్షశ్రేష్ఠము. 8. ఘనము.—గండమున్ = చెక్కిలిని, అబ్ధి వీచి కర తాడనచేన్ = సముద్రముయొక్క యల లను హస్తములయొక్క దెబ్బలచేత, అనయము = అత్యంతము, కందు = ఎఱ్ఱబాఱుచున్న, ఆత్మకున్ = మనస్సునకు, ఈపద్యమందు మోటరులెవరేని చెక్కిలి గీటగా కన్నీళ్లు కార్చుచు, మఱియెవ్వరయిన ముగ్ధునకు చేతితో చిన్నదెబ్బ కొట్టఁగా నోరుతెఱచి ఏడ్చుచు, ఒకశిశువు తన చెంతనున్న తనయక్క తల్లి మొదలయినవారి కాళ్లదగ్గఱకుపాఱఁగా వారియుత్సాహమందు వారు తన్ను చూడక సంచరించుటవలన వారి కాలిపారాణి తగులుటచేత నెఱ్ఱనైన తనలావణ్యమయాంగములతో ఎట్లుండునో అట్లు మలయపర్వత మున్నదని తా. 9. తరు.— జీర్ణ కరకా అంశ వ్రాతములు = పగిలిన కమండలువులయొక్క ముక్కల సమూహములు, వటువుల్ =బ్రహ్మచారులు, ముంజఆవళి మేఖలల్ = ముంజిగడ్డియొక్క సమూహముయొక్క మొలత్రాళ్ళు, అమృతవాణిన్ = అమృతమధురమైన వాక్కుచేత, అళుల.—తొలి మూడుపాదములలో చెప్పు కర్త, అళు = తుమ్మెదలయొక్క గీతిన్ = గానముచేత, స్వాగతంబున్ = కుశలప్రశ్నను, ఫలభరనతశాఖిన్ = పండ్లబరువుచే వంగినవృక్షములచేత, నోహారు = నమస్కారము, చెలి = ఓమిత్రమా, సపర్యన్ = పూజను, 10. స్థాన.— సమతా తార మంద్ర వ్యవస్థల్ = సమస్వరము ఉచ్చైస్స్వరము అధఃసర్వము—వీనియొక్క భేదములు, స్ఫుటంబై = స్పష్టముగా, స్వాన శ్రీమత్ విపంచీ స్వరమునన్ = నాద గుంభన కలదైన వీణయొక్క ధ్వనియందు, అళినీ ఝంకృతింబోలెన్ = తుమ్మెదల ఝంకారమునందువలె, చేరన్ = (వక్ష్యమాణమయిన గానము) కలసిపోఁగా, కానన్ = అడవిలో, మే = దేహము, మాయన్ = నిలిచిపోఁగా, మృగంబుల్ = లేళ్లు, విశద పద మధు స్ఫీతిన్ గీతిన్ ఆలించున్ = స్పష్టమయిన తేనెవంటి పదములయొక్క వ్యాప్తికలదైన (విశద అనునది స్ఫీతికి విశేషణము) సంగీతమును వినుచున్నవి, కాకలి యనఁగా మధుర

మైన సూక్ష్మనాదముఁ, కోరరానిది = సాయోగ్యతకుమీఱినది, కేరఁగాన్ = ఉత్సహింపఁగా దరి=గట్టు, నీరజ ఉదర భూరజంబునన్=కమలముయొక్క కడుపున పుట్టిన పుప్పొడియందు, సౌరు = అందము, చెన్నారుమేగలగౌరి = ఎవరిదేహమునకు ఒప్పుచున్నదో ఆగౌరీ, రతిన్=భక్తిని - పూజను. ప్రాపై,—ప్రాపు ఐ=పోషకములై-రసమును పోషించునవి అయి, వ్యంజనధాతువుల్ = గానము కు స్పష్టతను కలుగఁజేయుప్రకారములు, వ్యక్తిన్=స్పష్టతను, లయ = కాలక్రియాసామ్యము, యతులు=నిలుపుదలలు, తత్త్వము=విలంబితమనువాద్య ప్రకారవిశేషము. 11. దేవ,—వేగన్నులున్=వేయి కన్నులును, గ్లావర్జంబు=చంద్రహీనము, బలిలోకంబు=పాతాళము, 12. స్వస్తి=క్షేమము, వరదానము=వరునియొక్క దానము - వరముయొక్క దానము అని శ్లేష. అపవారించి = మఱుఁగుపెట్టి. బిస—బిసరుహ ఆయత వీక్షణ = కమలములవలె విశాలమైన నేత్రములు గలదానా, విసిగెను=బడలెను, శ్వసిత కంపిత సాంద్రఘనస్తనీ = నిట్టూర్పులచేత వణఁకుచున్నక్రిక్కిఱిసియున్న దిట్టమైన స్తనములుగలదానా, ఏఁచెదు=ఏఁచెదవు - ఆయాసపెట్టెదవు. 13. కులపతులు—పదివేలమందిమునులకు అన్నవస్త్రములిచ్చి అధ్యాపనచేయుబ్రహ్మర్షికి కులపతి యని పేరు.—బహువచనము పూజార్థకము, సవనము=పూజ, (స్నానము). శ్రీవివన్.—వివన్ = వ్యాపించునటుగా, ఉష్ణీషంబు = కిరీటము (పాగయు), ఊర్ణా ఆవర్త అంకము = ఊర్ణ యను (కనుబొమ్మలనడిమిసుడికి ఊర్ణయని పేరు) నలంకారముగలగి, హర్యక్షము = సింహము, విభ్రాజి = ప్రకాశించునది. 14. జఘన ఆభోగ = నితంబవైశాల్యముయొక్క. గాసిన్—గాసిన్= తాపకృతమయినయాయాసమును. సైఁపక = సహింపక, ఘృష్ట చందన రస ఓఘ శ్వేత గండ అద్రి=ఒరయఁబడిన చందనపుఁ బాలయొక్క ధారచేత తెల్లనైన కొండవంటి కపోలములు గలది, ఆసక్తశ్రుతీ తాళవృంత పవమాన ఆవీజ్యమాన ఆస్యము = చేరినచెవులనెడు విసనకఱ్ఱలయొక్క వాయువుచేత అంతటనువీవఁబడుచున్న మొగముగలది, నాసా ప్రోజ్ఝిత శీకరంపు జడి వానన్=తుండముచేత విడువఁబడిన తుంపురుల దట్టపు వర్షమును, వాసింబాసిన = పసి చెడిన, వాడు= వాడిపోవుచున్న, సల్లకము=అందుగుచెట్టు. 15 భర్తృదారిక.—భర్తృ=ప్రభువుయొక్క దారిక=కొమారిత, అట్లే భర్తృదారకుఁడు = ప్రభు పుత్త్రుఁడు. 18, పలుపనె.- చంద్రికా ధవళ శర్వరులన్ = వెన్నెలచేత తెల్లని (వైన) రాత్రులను, తొగతావిన్ = కలువయొక్కపరిమళమును. నిశా అస్య సమీరణంబులోన్=రాత్రి తొలిజాముయొక్క వాయువునంగ. 20. నీమోము.—తామరస అరాతి మణి వితర్ది = కమల శత్రు మణి (చంద్రకాంతమణి) యరఁగు, కొమరు = సౌందర్యము; 21. పరి

పూర్ణ.—పరి ..రముఁ - పరిపూర్ణ = నిండిన, బింబ = మండలముయొక్క-శోభా=కాంతిని, ధరముఁ = ధరించినదియు (చంద్రరేఖాపరమయిన యర్థము); పరిపూర్ణ = నిండిన, బింబశోభ=దొండపండుయొక్క శోభగలదైన, అధరముఁ= అధరోష్ఠముగలదియు (ముఖపరమయిన యర్థము), దయిత మొగముదివి = ప్రియురాలి ముఖమునకు చెందినది ఐ, పరగు = ఒప్పునట్టి (రేఖకు విశేషణము), నెల = చంద్రుఁడు. ఆవిద్యా.—వంశమణి - వంశ = వంశమను వెదురుయొక్క - మణి = ముత్యమయినవాఁడు, ధీ విక్రాంతి వినతి రూప ఘనుఁడుఁ = బుద్ధిపరాక్రమ వినయ సౌందర్యములచేత గొప్పవాఁడును, దీప్త ఆదృతిఁ = ప్రకాశించుచున్న ఆసక్తితో, అ మ్మేటికిఁ = అట్టి మహానుభావుఁడైన (జీమూతవాహనునికి). 25 బుక్కా.—బుక్కావానఁ=బుక్కావర్షముచేత-విస్తారముఎల్లయెడల బుక్కా చల్లుటచేత, సురాద్రి స్ఫురణము = మేరుపర్వతముయొక్క కాంతిని-మేరువు=బంగారుకొండ-బుక్కాచేత మలయపర్వతము అంతయు బంగారమువలె ఆయెనని తాత్పర్యము, సంవాది అరుణ మణి రణత్ హంసక స్వాన సక్తఁ ఆ కాంతా ఉద్గీతిఁ = లయసరిపడుచున్న ఎఱ్ఱని మణులుగల ఘణిల్లని శబ్దించుచున్న పాదకటకములయొక్క ధ్వనితో కూడినదైన యా స్త్రీలయొక్క ఉచ్చైర్గానముచేత, ఎఱ్ఱనిమణులు ధరించుట ఉత్సవానుగుణము; 'సంవాది' స్వానవిశేషణము; 'ఆ' ఉద్గీతికి విశేషణము; స్నపనకము = స్నానసమయము. 27. పితామహుఁడు=బ్రహ్మదేవుఁడు. 30. ఏను.—పోనె = పోవుటకే, వామత నె=కుటిలతచేతనే నవ ఊఢ=పెండ్లికూఁతురు నవ (క్రొత్త) ఊఢ (వివాహముచేయఁబడిన స్త్రీ). మానఁ.—భాను ఊష్మ అతిగ చంద్రికా అభిఖ మహత్ పంచ అగ్ని తప్తుండను=సూర్యునియొక్క వేఁడిమిని అతిక్రమించెడు వెన్నెలయను పేరుగల గొప్ప అయిదు అగ్నులచేత కాల్పఁబడినవాఁడను. గాసిఁ.—ఉరోజ = కుచములయొక్క, నితంబము = పిఱుఁదు, ఊరువులఁ = తొడలను, కాంచి = మొలత్రాడు, ఒండు = ఒకట, సైరింపద = సహింపనే సహింపదు, నిప్రతీకములై కైసేఁతలు = నియుంగకములే అలంకారములు. 31. క్షీర.—శ్రీ = శోభాయుక్తములైన, క్షీర స్రుత్ చందన ఆళీ శిశిరిత తలముల్ = పాలను స్రవించునట్టి గందపుఁజెట్ల సమూహముచేత చలువచేయఁబడిన అధఃప్రదేశములు కలవి, తారధ్వనికిఁ = ఉచ్చైశ్శబ్దమునకు తాండవంబు = ఉద్ధత నాట్యము, వారివ్యూహంబు = నీటి ప్రవాహము, పతత్ పౌష్ప ధూళీ వృతంబు = పడుచున్న పుష్పసంబంధమైన పరాగముచే కప్పఁబడినది, భూరుహ ఆవాల పంక్తిఁ = చెట్లపాదుల వరుసను, క్షుద్ర కుల్యల్ = చిన్న కాలువలు, పూరించుఁ = నిండించును, రెండవపాదమందు ధారాజలయంత్రగృహధ్వని మేఘగర్జితమని భ్రమించి

నెమలి ఆడసాగెను అని యభిప్రాయము. కల.—కల = మధురమైన, తీవమాడు పులు = తీఁగమేడలు, పుష్పధూళులన్ = పుష్పాంశులచేతను, పిష్టాతకవిభ్రమంబు = బుక్కాయొక్క విలాసము, గండు = మగది, ఏవలనంజూచినన్ = ఎల్లయెడలను, పర్యాప్తిమైన్ = తృప్తితో - తృప్తిగా, ఆపానమహంబు = కలసిత్రాగుటయొక్క యుత్సవమును, కలయన్.—కల్ప స్రక్ ఆకల్పముల్ = కల్పవృక్షము యొక్క పూదండ లనెడి యాభరణములను, వెలి పుట్టంబులు = తెల్లవస్త్రములు, భూషణ అబ్జమణి రుక్ విచ్ఛిత్తిన్ = ఆభరణములయొక్క పద్మరాగమణులయొక్క కాంతియొక్క సొంపుచేతను, కలపుఐ = గుమిగూడి, గండూష = పుక్కిలింత యొక్క, పేరువెలమిన్ = గొప్పసంతోషముతో, కంటె = కంటివె. 32. మారుగ = చక్కఁగా, సుభ్రూలతము = మంచిబొమలనెడు తీఁగలుగలది. భావవత్ అరుణ అధర ఓష్ఠ పల్లవము = ప్రకాశముగల ఎఱ్ఱని క్రింది పెదవియను చిగురుగలది, నందనము = సంతోషపెట్టునది - నందనవనమును, లాఁతి = నందనమని ప్రసిద్ధికెక్కిన యింద్రోద్యానము, కేవలారణ్యము = నందనమునుగాదు ఉద్యానమునుగాదు, వర్ణించుట = పొగడుట - రంగువేయుట. మగువ.—స్మితపుష్ప ఉద్గమము = నవ్వనెడు పువ్వుయొక్క ఉత్పత్తి, అధర పల్లవ పుటముపై = అధరోష్ఠమనెడు చిగురుయొక్క దొప్పపై ఫలము = ప్రయోజనము అనుపండు, పజ్జన్ = పార్శ్వమందు, ఏస్మితమును చూచుటచేత నాకన్నుదోయి కృతార్థమాయెనని తాత్పర్యము. 33. సూర్య.—జొత్తిల్లి - కంది = ఎఱ్ఱఁబారి, రదనకిరణ కేసరములు = దంతకిరణములనెడు కింజల్కములు, తామరసమయేని = కమలమే అయినయెడల - అనఁగా తామరసమే కాఁబట్టి, మధుపము = తుమ్మెద. 34. రుద్ధ రంబు - రుద్ధ బ్రఘ్న ఉస్రతా = అడ్డగింపఁబడిన సూర్యునియొక్క కిరణములుగలిగియుండుట, వర్షుక దిన మతి కృత్ = వర్షించుచున్న దినము యొక్క (దినమనెడు) బుద్ధిని (భ్రమను) చేయుచున్న, రోదసీ శ్యామతా = భూమ్యాకాశములయొక్క నల్లఁదనము, సంబద్ధ = వానితోఁ కట్టఁబడిన - అనఁగా అవి కలదైన, వ్యోమయాన ఘట్టా మహిమ కృత హరిత్ మర్త్య మాన అంబరము ఐ = ఆకాశయానములయొక్క గుంపుయొక్క దైర్ఘ్యముచేత చేయఁబడిన దిక్కుల నడిమికొలఁదిగలదైన యాకాశము కలది ఐ; సిద్ధానీకంబు = సిద్ధులదండు, భవన్ శిష్టిన్ = నీయొక్క శాసనముచేత, యుద్ధ ఆదృత ఇష్టిన్ = యుద్ధముకొఱకు గ్రహింపఁబడినకోరికతో, (ఇదిగో), సంప్రస్థితము=చక్కఁగా బయలువెడలినది (నిశ్చయార్థమందు భూతార్థక ప్రయోగము), ఇద్ధ అరి నాశ అచిర దర కరద స్ఫీత రాజ్యంబు=ప్రకాశించుచున్న శత్రువుయొక్క సంహారముచేత స్వల్పకాలము భయముకలిగిన కప్పమిచ్చువారు గలదైన

ప్రవృద్ధమైన రాజ్యము, సిద్ధంబు=నిశ్చయముగా మరల లభించును; మాసైన్యములైన సిద్ధులు సూర్యరశ్మి అగపడక ముసురుదినమో యనుభ్రమ కలుగునట్లు ఆకాశమెల్ల ఆక్రమించునన్ని విమానములతో యుద్ధార్థమై యుత్సాహముతో బయలువెడలుదురు, వారిని నడపుటకు నీయాజ్ఞనుమాత్రమే ఎదురుచూచుచున్నాను, మేముదండెత్తిపోయి యుద్ధముచేసినవెంటనే నీశత్రువు నశించుట నిశ్చయము, అంతట స్వల్పకాలము భయపడియున్న నీసామంతరాజులు మరల నిన్నే కొలుతురు, నీగొప్పరాజ్యమంతయు మరల నీకు స్వాధీనమగును — అని తాత్పర్యము. ఏకాకిని=అసహాయుఁడను, కోశ ఆకృష్ట ఖడ్గ ఘృణి సంహాతి కేసర ఆ ప్తి = ఒరనుండి దూయఁబడిన కత్తియొక్క జూలు వంటి కిరణ సమూహము కలుగుటచేత, ఆఁకొన్న = ఆఁకలిగొన్న, హాళాహాళిన్ = వేగముతో, ధాకన్ = శౌర్యవిజృంభణతో, మంతగహతకున్ = హతకుఁడైన (వ్యు. చంపఁబడిన, చచ్చిన, ఇదియొకతిట్టు) మతంగుఁడను గంధర్వుని, కూల్చినాఁడన్ = నిశ్చయముగా కూల్చెదను. ప్రకట—ప్రకట ఆర్తి స్వాప ముద్రా వ్యవకలిత మహాపద్మకోశుండు=ప్రసిద్ధమగు పీడగలదైన (పీడను గలిగించునదైన) ముకుళనమను ముద్రించుటనుండి విడిపింపఁబడిన గొప్పతామరమొగ్గలు గలవాఁడు (అనఁగా తామరలను వికసిల్లఁజేసి సంతోషపెట్టినవాఁడు), సంస్థా వికల ఆశా పూరణ ఏక ప్రియ నిజకర సంప్రీణిత అశేష విశ్వుండు = నియమముచేత హీనమైన (అనఁగా ఇంతింత వఱకు అని యగపడని) దిక్కులను నిండించుటయే ముఖ్యమయిన ప్రియముగాఁగల తన కిరణములచేత మిక్కిలి సంతోషపెట్టఁబడిన సకలలోకముగలవాఁడు, అకలంక ఆనంద సిద్ధ ఆళి అభినుతి పదము ఐ=నిర్దోషమైన సంతోషముగల సిద్ధుల సమూహముయొక్క (అళియని పదవిభాగమగునెడల ఆనందసిద్ధములు అనఁగా సిద్ధానందములైన మకరందాదిలాభముచేత ప్రాప్తించిన సంతోషముగలవైన తుమ్మెదలయొక్క అని యర్థము) స్తుతికి విషయమై, అస్తమున్ = అస్తపర్వతమును, పొందుచున్నాఁడు; మఱియొకయర్థము.—మహాపద్మకోశుండు = మహాపద్మమను నిధిగలవాఁడు (ఆనిధిని తెఱచి లోకులకు ఇచ్చినవాఁడు), ఆశా = కోరికలను, కర = చేతులచేత, సిద్ధ = సిద్ధకాములయొక్క - కోరికలు తీఱినవారియొక్క, అస్తమున్ = అంతమును - మరణమును (అనఁగా మరణసమయమందుఁగూడ మహోపకారములు చేయుచు ఆకీర్తినిపొందుచునేపోవువాఁడు), మిత్రుఁడు=స్నిగ్ధుఁడు-లోకుల కందఱికి స్నేహితుఁడు. ఇందువలన ‘‘నీవు ప్రాణివధకై యత్నించుచున్నావు, ప్రాణ్యుపకారముచేసినం గీర్తి కలదుగాని వధచేత కీర్తి లేదు, ఆయత్నము మాని ఉపకారప్రయత్నము చేయఁదగును,’’ అని మిత్రావసువునకు నాయకుఁడు అన్యాపదేశముగా ఉపదేశించుచున్నాఁడు. 35. భవ్య.—అంతఃపురవ్యవస్థన్=రాజభార్యలయొక్క యేర్పా

టును (పట్టణములలోపల కట్టుగిట్టములను అనియు అర్థము), భవ్యతఁ=చక్కఁగా, ప్రతిపదమునను = అడుగడుగునను, అనఁగా కాలెత్తి అడుగు పెట్టినప్పుడెల్ల (ఉద్యోగస్థులయొక్క అన్ని యధికారములయందును), సంస్ఖలితములను=కాలుజాఱుటలను (లంచములు పుచ్చుకొనుట రాజద్రవ్యమపహరించుట మొదలయినదోషములను), దండనీతిఁ=చేతికఱ్ఱయొక్కనడపుటను అనఁగా చేతికఱ్ఱయొక్క తోడ్పాటును-(నేరమిచేసినవారిని దండించునట్టిచట్టమును), ముదిమిఁ=ముసలితనమందు, నృపవృత్తము=రాజచర్య, మొనసెఁ=ప్రాప్తించెను. పానుపు—పానుపు=పడక, శాద్వలంబు = పచ్చికబీఁడు, కలుబల్లలు=రాతిబల్లలు, నిర్ఘరోదకము=సెలయేళ్లనీళ్లు, భక్తము = అన్నము, కందములు = గుంపలు, ఏణముల్ = లేళ్లు, అయత్న సుఖసుండితము = ప్రయత్నములేకయే కలుగునట్టి సౌఖ్యముచేత అలంకరింపఁబడినది, పర అర్థ విరహ ఆర్తి కదర్థితము = ఇతరుల ప్రయోజనముయొక్క అభావమువలని దుఃఖముచేత పీడింపఁబడినది, కటా = అయ్యో. 36. జల.—జలకరులు = నీటియేనుఁగులు, ఊర్మి = అల. చయ్యనఁ = వెంటనే, కందర ఆస్య ఘటిత ప్రతిఘోషలు = గుహాముఖములందు వ్యాపించు ప్రతిధ్వనులు, లలత్ అతిసంఖ్య శంఖ ధవళంబు = చలించుచున్న లెక్కలేని శంఖముల చేత తెల్లనైన. కవళించి.—కరిమకరులు=ఏనుఁగులును మొసళ్లును, చిక్కఁ వలుచు = చిక్కఁగా పరిమళించుచున్న, రత్న చ్ఛవితోఁ = పగడములయొక్క కాంతితో. 37. ఆపన్నిధానము = విపత్తులకునిధి, అశుచిప్రాపకము=అశుచిని కలుగఁజేయునది, హేయము=త్యజింపఁదగినది. 40 మహా,—మహత్ అహీంద్ర మస్తిష్క మాథ ఉల్బణ అసృక్ బృహత్ త్రోటి తీక్ష్ణుండు=గొప్పపాపరాజుల మెదడును చిందఱవందఱచేయుటచే స్పష్టమైన నెత్తుటిచేత పెద్దదయిన ముక్కుచే భయంకరమైనవాఁడు, అహి ద్వేషుండు=పాముల శత్రువు- గరుత్మంతుఁడు, మల్లాడు = పెనఁగొను, సహంబు=తేజస్సు, శుద్ధసత్త్వాత్ముఁడు=కేవలసత్త్వగుణముగలవాడు. 41. ప్రాంచత్.—ఇందుఁ=ఈశ్మశానమందు, ప్రాంచత్.. ఝురజము—ప్రాంచత్ = వ్యాపించుచున్న-వ్యాబద్ధ=చాపఁబడిన- పక్ష ద్వయ = ఱెక్క జోడుయొక్క-విధుతి=కదపుటగలవియు- మహత్ ధ్వాంత కృత్=గొప్ప చీఁకటిని చేయునవియు నైన-గృధ్రసంసద్=గద్దలయొక్క సభ (సమూహము) యొక్క - చంచూపుటీ=దొన్నెవంటి ముక్కుయొక్క- అగ్ర=కొనచేత- కృత్త చ్యుత=ఖండితములై జాఱిపడిన-పిశిత లవ = మాంసలేశములయొక్క- ఆస్వాద సంవృద్ధ గర్ధా పంచ ఆస్య = రుచిచూచుటయందు అతిశయించిన కోరికగల తెఱచిన నోళ్లచేత- ఉద్వాంతశావ ప్రతతి పతన= క్రక్కఁబడిన (సర్ప) శవసమూహములయొక్క మొత్తములయొక్క రాలు

టచేత- నిర్వాణ శబ్దాయమాన = ఆఱిపోయినవియు శబ్దించునవియునైన-అచంచత్ ప్రేతానల అసృక్ ఝుర జము = ప్రకాశింపని సొదనిప్పులనుండియు రక్తప్రవాహములనుండియు పుట్టిన, శ్వాసరుధ్ గంధము - ఊపిరిని అఁపునట్టి కంపు, పొలయుచు=వీచుచున్నది; గద్దలు పాములను కఱచుకొనిపోయి ఆకాశమునఉండి పాపదేహమును కొంచెము కొఱికి ఆకొఱుకుటచేత క్రిందరాలుచున్న లేశమునుకఱచుకొనుటకై నోరుతెఱవగా నోటనున్న పాములు క్రింది చితాగ్నులలోను రక్తప్రవాహములలోను పడఁగా అగ్నులుఆఱిపోయెననియు రక్తప్రవాహములు శబ్దించెననియు ఆయుభయమునుండి బయలువెడలిన కమరుఁగంపు ఊపిరి సలుపనీయకపోయెననియు అర్థము; బహుజుగుప్సితస్థాన మిది యని భావము. అహరహంబు=ప్రతిదినము, అహిచ్ఛటా ఆహారమునను=పాముల సమూహమే అను మేఁతచేత (శివపరముగా - సర్పసమూహమను హారముచేత), వినాయకునకున్=పక్షులయొక్క రాజయిన గరుత్మంతునికి (శివపరముగా-వినాయకున కనఁగా విఘ్నేశ్వరునికి), చంద్ర ధవళ కపాల అస్థి సాంద్రము=చంద్రునివలె తెల్లని పుఱ్ఱెలచేతను ఎముకలచేతను దట్టమైనది (శివపరముగా-శిరస్సునందలి చంద్రుఁడును తెల్లనివైన పుఱ్ఱెలు ఎముకలు వీనిచేత నిండినది, శర్వదేహంబు=శివునియొక్క శరీరము, శ్మశానము=వల్లకాడు. 42. ప్రళయ.—ప్రళయ అభ్ర అభంబులై=ప్రళయకాలపు మేఘములయొక్క కాంతివంటి కాంతిగలవై, అవే పక్షతి ప్రాంత పంక్తుల్=అవిగో ఱెక్కలయొక్క అంచులయొక్క వరుసలు, అభ్రము పొదివెన్=ఆకాశమును ఆవరించెను. జలరాశిగాలిచేత, అంభంబు=సముద్రముయొక్క జలము, రంహః శ్వసనమునకున్ = వేగముయొక్క భూక్షాళనంబు=భూమిని కడుగుటను, కల్పభీన్=ప్రళయమేమో అను భయముచేత, సంధ్యాపయోద ఆళి=సంధ్యాకాలపు మేఘసమూహము. 43. తారా.—తారా ప్రాణ ఈశమూర్తిన్=నక్షత్రముల ప్రాణనాథునియొక్క అనఁగా చంద్రునియొక్క బింబమును, దరిసి=సమీపించి, మత్ త్రస్తున్ చక్రస్థున్ శేషున్ తలఁచి-నావలన భయపడినవానిని చుట్టగా నున్నవానిని (నాకు భయపడి చుట్టచుట్టుకొనియున్న) శేషుని జ్ఞప్తికి తెచ్చుకొని-నాకు భయపడి చుట్టచుట్టుకొనియున్న శేషుఁడు నేను చంద్రుని చూడఁగానే తత్సాదృశ్యముచేత నాకు జ్ఞాపకము వచ్చెనని తాత్పర్యము, భీన్=భయముచేత, ద్రొబ్బన్=ఈడ్వఁగా, దినమణి-సూర్యుఁడు, అన్న=అనూ

రుఁడు, సూర్యునిసారథి, బారంజన్—బారు=గొప్ప - అంజన్ = దాఁటుచేత ప్రతిజనిన్=ప్రతిజన్మమందును, ప్రాపించుతన్=సంభవించును గాక. ఈవధ్యా.—అశ్మము=రాయి, పాతితున్ = పడవేయఁబడినవానిని, అస్రము=రక్తము, అరుణ=ఎఱ్ఱని, మద్ భయ ప్రావిర్భావ విదీర్యమాణ హృదయ అస్ర వ్యాప్త కల్పున్ = నావలని భయముయొక్క సంభవముచేత పగులుచున్న గుండెయొక్క రక్తముచేత ఆవరింపఁబడినవానితో సమానుఁడైన; నేను వచ్చి మీఁదఁబడుదు నను భయముచేత గుండె పగిలి ఆరక్తము దేహమంతటను క్రమ్ముకొనెనా ఏమి అనునట్లున్న పామును అని తా. ఆమో.—ఆమోద=పరిమళముచేత, చక్రవాళంబు=మండలంబు, ఘమాయించున్=మ్రోఁగుచున్నవి, ఊటాడి=కదలి, భూమన్ = విస్తారముగా, సంవర్తక=ప్రళయకాలముయొక్క. 44. ఫేననిభంబు=నురుగువంటిది, భంగితము = సంజాత భంగము-ముడతలుగలది, క్షౌమ=దుకూల, ఒఱపున్=సౌందర్యమును, పురణించున్=పోలును, గాదిలి = ప్రియురాలైన, వేలానిధి = చెలియలికట్టవంటిది, లాలిత = లాలింపఁబడినది 45. స్తోమంబు= మొత్తము, ఔత్పా కృతిన్=ఉత్పాతసంబంధమైన మిక్కుటమైన విజృంభణగలిగిన గాలిచేత కదల్పఁబడి పడిన నక్షత్రముయొక్కయాకారమును. 46. సురుచిన్.—మున్=మొదట, భూరిపాతన్=విస్తారమయిన పడుటకలదానిని, సురుచిన్=మంచికాంతిగలదానిని (విస్తారముగా పడుటచేత మంచికాంతిగా అగపడుచున్నదానిని), పిఱుందన్=పిమ్మట. సు విరళ పతిత స్థూల గోళన్=మిక్కిలి ఎ మెడముగా పడిన పెద్దబిందువులుగలదానిని, పెరరేపు బౌరాలన్=ఏరాలయందు చెదరునో ఆరాలయందు, శీర్ణ అమిత తనుకణికన్ = సడలిన అనేక సూక్ష్మలేశములుకలదానిని, ధాతులన్=గైరికాది ధాతువులందు, దరలక్ష్యన్=కొంచెము కనఁబడుదానిని, సాంద్ర తరుశిఖలన్=దట్టమయిన చెట్లయొక్క శిఖరములయందు, సంస్త్యాన నీలస్వరూపన్=చిక్కని నల్లనిరూపముగలదానిని, రక్తసరణిన్=నెత్తురు జాడను, ఎఱుకన్=తెలివితో. 48 నమ్రమూళివి జుట్టును (శిరమును) వంచినవాఁడవు-మదంఘ్రులకున్=నాపాదములకు. 49. సాక్షీర అచలకూట కోటిన్=చంపిన పర్వతశిఖర అగ్రమందు, ఖగ=పక్షి, అసృక్ ఘటా అక్తంబు-రక్తముయొక్క సమూహముచేత తడుపఁబడినది, త్రోటిన్=ముక్కును, దోనలన్=లోయలను, బూది-బూడిద, ఏర్పఁగాన్=కాల్పఁగా, ఉత్కర్తనము=పెకలుట,

రోమాంచ = గగుర్పాటుచేత. 50. కుబుసంబు పాముపొర, అందన్ =సమీపమందు. వ్యాజిహ్మరత్న అర్చిః=మలినమయిన శిరోరత్నముల కాంతిగలదైన. 51. కాలా.—కాల అంత ఆక్రాంత విశ్వగ్రసన రస లసత్ కాలజిహ్వా కరాళ జ్వాలా వాచాలన్ = కాలముయొక్క ముగింపుచేత ఆక్రమింపబడిన ప్రపంచముయొక్క (ప్రపంచమును) భక్షించుటయందైన ఆసక్తిచేత చలించుచున్న యముని నాలుకలవలెభయంకరమైన మంటలచేత శబ్దించుచున్నదియు, సప్త అశ్వ కబళన విధావర్ధమాన ప్రసక్త్యన్=సప్తయును గుఱ్ఱములుగలవానియొక్క (సూర్యునిని) మ్రింగుటయొక్క ప్రకారమందు హెచ్చుచున్న వ్యాప్తిగలదియు, ఖ్యాలోల ఉత్పాత వాత ప్రసర పటిమ మత్ ఉత్క సంధుక్షిత అర్చిః = మిక్కిలి చలించుచున్న అనిష్టసూచకమయిన వాయువుయొక్క వ్యాపించుటయొక్క పటుత్వమువంటి పటుత్వముగలదైన నాలిక్కలచేత వీవఁబడిన జ్వాలలుగలదియు. కల్ప దహన భయదన్ = ప్రళయకాలపు అగ్నివలె భయమును ఇచ్చునదియు (నైన), బాడబ అభోగ నాభిః=బడబానలము యొక్క వైశాల్యముయొక్క మధ్యలో 53. చేయుచు.—ప్రాక్ కృతవధ అఘము= పూర్వము చేయఁబడిన హింసయొక్క పాపము, భర్జిత బీజకల్పము = కాల్పఁబడిన గింజ వంటిది, ఆయతిన్=భవిష్యత్తునందు. 44. సంసృతి కలన్=సంసారము(జనన మరణప్రవాహము]అనుస్వప్నమందు, సైకత అయతఫణా ఉచ్ఛ్రితి )= ఇసుకతిన్నెల వలె విశాలమైన పడగలయొక్క ఔన్నత్యము, భోగ చక్రము= సర్వదేహముయొక్క చుట్ట. భ్రమ=సుడియనెడు, సమాజము = సమూహము, ఆపాదము = పాదముల పర్యంతము, ఘనధ్వాంతముక్= దట్టమయినచీఁకటిని, బాల ఆతప ఆర క్తతన్ = లేఁత యెండచేత అంతట ఎఱ్ఱగానుండుటచేత, చెందిరంబు సింధూరము, సేదన్ = ఆయాసమును, హరువునన్-రమ్యతతో. 56. రెక్కల.—జవ అనుగ ఈరణన్ = వేగముగల గాలియొక్క ప్రేరణచేత. ఏర్చి-కాల్చి,బాముల్=దుఃఖములు, 57 దవ్వ =దూరము, లిప్సన్=పొంద గోరికచేత, సరిన్=నదులయొక్కఁ పంకిల = పంకము గల, మహస్=కాంతిచేత, వాఞ్ఛిత అభిషవంబు=కోరఁబడిన అభిషేకమును, నేమించితిన్ =నియమించితిని. నీ్రమోలన్ .—ఎగట, అత్యద్ధతి సదా నీరాజిత అత్యసిత శ్రీమాన్యంబు నయొక్క కాంతిచేత ఎల్లప్పుడు నివాళింపఁబడిన తనయందు ఉన్న లక్ష్మిచేత పూజ్యము, మండలాగ్రమును కత్తియు, దోఁదంతి = వెతుర్దంతి, నాలుగు

దంతములయేనుఁగు, హరిరాజము=శ్రేష్ఠమయినగుఱ్ఱము, మలయ=మలయవతి, శ్రీశ్రేయసంబు=మంగళము, మాణిక్య చతుష్టయంబు=రత్నములయొక్క నాలిగింటి మొత్తము - అనఁగా నాలుగు మాణిక్యములను-అనఁగా నాలుగు ఉత్కృష్ట పదార్థములను 58 ఉరగము=పాము, తత్=పక్షులయొక్క, అక్షీణ అసుండన్=క్షయింపని ప్రాణములు కలవాఁడను, అవ్యసులు=అ+వి+అసులు—వ్యసులు (పోయిన ప్రాణములుగలవారు, ప్రాణముపోయినవారు) కానివారు అనఁగా బ్రదికియే యున్నవారు, గురువులు=తల్లిదండ్రులు, ఆశ్వాసము=కోరఁదగినది, ఘనుల్=మేఘులు, హృష్ట శిఖండి తాండవము కాన్=సంతోషించిన నెమళ్లనృత్యము అగునట్లు, వేళన్=కాలములో, వృష్టిన్ చేసి=వర్షమును గురియించి, క్షితిన్=భూమిని, హరిత్ సస్య ఉత్తరీయన్=పచ్చని పైరనెడు ఉత్తరీయముకల దానినిగాను! సంస్పష్టశ్రీన్=స్పష్టమయిన భోగములు గలదానినిగాను, ఒనరింత్రుగావుతన్=చేయుదురుగాక, పుష్ట ఉదారతన్=పోషింపఁబడిన (పూర్ణమయిన) గొప్పతనముచేత, సుకృతంబున్=పుణ్యమును.

